# గీతావాణి

42



## శ్రీగీతాసాహిత్యసేవాసమితి

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

ఈ సంచిక వెల పంద్రెండణాలు.

# కృతజ్ఞతా సమర్పణము.

★

ఆర్థికంగా తోడ్పడి పత్రికకు జీవనదాతలై వెలసిన పోషక మహాశయులకు, పత్రికయొక్క అంతరంగ సౌందర్యాన్ని అభివృద్ధిపరచుటకు మాకు చేదోడు వాదోడై శాయశక్తులా సహాయంచేసిన వ్యాస కర్తలకు, శక్తివంచనలేక పత్రిక తమదిగా భావించి సర్వాంగ సుందరోపేతంగా ముద్రించి యిచ్చిన శ్రీ వేదవ్యాస ప్రెస్సువారికి యీ పవిత్ర శుభ సమయంలో మా సాదర సవినయ కృతజ్ఞతలు సమర్పిస్తూన్నాం. గీతాచార్యుడు వారికి అభ్యుదయదాత యగుగాక!

ఆళ్లగడ్డ,
15-12-54.

స్వామి శివానంద,
మేనేజరు - గీతావాణి ఆఫీసు.

---

## తోడి పత్రికాధిపతులకు విజ్ఞప్తి.

ఈ గీతాజయంతి విశేషసంచికను మీ పత్రికలో సమీక్షింప ప్రార్థన.

Exchangeగా పంపే పత్రికలను క్రింది చిరునామాకు పంపండి.

మేనేజింగ్ ఎడిటరు.
గీతావాణి-ఆళ్లగడ్డపోస్టు. (కర్నూలు)

# గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.





మేనేజింగ్ ఎడిటర్:



మేనేజర్:

గీతావాణి – ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15th DECEMBER 1954.

భగవద్గీత – భక్తియోగము

# ప్రముఖుల అభిప్రాయములు.





LOKASABHA,
NEW DELHI.

No. D. 2262/54 Dated 14th Nov. 1954.

*Dear Shri Shrikantham,*

*I am glad that the Gita Sahitya Sevasamati is organising* **Geetajayanti** *in Andhra and intends to publish a Special Issue of the* **Geetavani** *on the occasion.*

*The Gita has given us the best and the highest philosophy of life. It is up to us to always keep it in our mind and act up to it. I trust, your Special Issue of the Gitavani will lay stress on action without expectation of fruit.*

*Wishing your effort every succes.*

*Yours sincerely,*

20, Akbar Road,
New Delhi.
14—11—54.

**(G. V. Mavalankar.)**
Speaker, Loka Sabha.

---

*I consider that the Mahavakya of Gita is*
वासुदेवः सर्वमिति स महात्मा सुदुर्लभः।
*and Gita's main* साधन *is*
सर्वधर्मान् परित्यज्य मामेकं शरणं व्रज।
*I think this is a sufficient short message.*

*Swami Madhavtirtha*



---




[illegible]

నాగపూరు 13.11.54

భో. పట్టాభి సీతారామయ్య

గవర్నర్, మధ్యప్రదేశ్.


సంత్ వినోబా జీ

గంగాప్రవాహం సహజంగా అంతటా పవిత్రమైనదే. కానీ హరిద్వారం, కాశీ, ప్రయాగాది పుణ్యక్షేత్రాల్లో మిదుమిక్కిలి పునీతమై విలసిల్లింది. గంగామాత విశ్వాన్నంతటినీ పావనం చేసింది. గీతామాత కూడా అట్టిదే. ఆదినుంచి అంత్యంవరకు మొత్తం పవిత్రమైన గ్రంథరాజమే. అయినా మధ్యమధ్య కొన్ని అధ్యాయాలు తీర్థక్షేత్రాలవలె ప్రకాశిస్తున్నాయి. అందులో పండ్రెండవ అధ్యాయం పరమ పావనమగు తీర్థస్థానమైంది. స్వయంగా శ్రీ కృష్ణభగవానుడే ఈ అధ్యాయాన్ని “యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే” అంటూ “అమృతధార” అని అంటూన్నాడు. ఇది ఇరవై శ్లోకాలుగల చిన్న అధ్యాయం. కానీ నిజంగా అమృతధారే.

వినోబా.

---

## భక్తియోగ ప్రాశస్త్యము.

పంద్రెండవ అధ్యాయమునందు భక్తినిగూర్చి విస్పష్టముగా జెప్పినందుచేత దీనికి భక్తియోగమని పేరు వచ్చినది. వీనిలో నేది శ్రేష్ఠమని ప్రశ్నరాగా యేదైననూ సరియే - శ్రద్ధయను సుగుణముతో గూడి నిరంతరము సచ్చింతనము గలవా డెవడైననూ వాడే శ్రేష్ఠుడని భగవంతుడుపదేశించెను. దేహాభిమానము, కులాభిమానము, ఆశ్రమాభిమానము, విద్యాభిమానము, అధికారాభిమానము మొదలగు దేహసంబంధ బంధనముగలువారికి మోక్షప్రాప్తిగలుగుట ప్రయాసమని యుపదేశించిరి. ఇట్టి అభిమానము ఆత్మను కనపరచనీయక కప్పివేయుచుండును. మరియు ఈ జ్ఞానయోగమే అన్నిటికంటె శ్రేష్ఠమని తెలిపి యట్టి జ్ఞానయోగమునకు శక్తిచాలక పోయినచో ధ్యానసమాధియోగముల నుపదేశించిరి. దానికిన్నీ శక్తిసామర్థ్యములేనివారికి భక్తియోగము నుపదేశించిరి. అనన్యమగు భక్తియోగమును శీలించుటకు సమర్థతలేనిచో నిష్కామ కర్మయోగము నాచరించిన చాలునని తెల్పిరి. దీనికిని సమర్థతలేని పక్షమున నెవరైనను సత్కర్మ లాచరించువారిని జూచి సంతోషపడిన సద్గతి గల్గునని వచించిరి. తాను చేయుటకు నిష్టములేక నెవరైననూ చేయుదానిని జూచి యసూయపడకుండుటయు, నాటంకము గలుగజేయకుండుటయు పుణ్యమని యానతిచ్చిరి. కావున సత్కర్మలకు నాటంకముజేసి నరకమునకు బాల్పడకుండా చూచుట శ్రేయస్కరము.



భగవద్భక్తులకుండవలసిన సుగుణములన్నియు బాగుగ నీ అధ్యాయమున దెల్పియున్నారు. గీతాపారాయణము చేయువారు మొదటినుండి ప్రారంభించక అనగా ప్రథమాధ్యాయమునుండి యారంభము చేయక నీ పంద్రెండవ యధ్యాయమునుండి మొదలుపెట్టుట మంచిదని పరంపరానుభవముగల పెద్దలు చెప్పుదురు. ఇది పారంపర్యధర్మమని గూడా తెలిపెదరు. అట్లయిన విఘ్నములుగూడా గలుగవని వచింతురు.........
ఈ అధ్యాయమున నమృతసమానమైన వాక్యములు గలవు.

శ్రీవ్యాసాశ్రమం,
16—11—54.

శ్రీమలయాళస్వామి.

పంద్రెండవ అధ్యాయమైన భక్తియోగ సారాన్ని తెలుప దలచాను. వివాహ సందర్భంలో పంచయజ్ఞాలలో ఈ భక్తియోగంకూడా ఒక యజ్ఞమని దీనిని కంఠస్థంచేసి



మననం చేయవలసిందిగా నూతన దంపతులకు మనం చెబుతూంటాం. భక్తి లేనట్టి జ్ఞానం, కర్మ శుష్కప్రాయ మౌతుంది. అంతేగాదు భక్తిరహితమైన జ్ఞానకర్మలు బంధహేతువులే అవుతాయి. అందుకని భక్తిభావంతో గీతలోని ఈ భక్తియోగాన్ని మననం చేయాలి. ...... 'అనన్య భక్తివల్లనే భగవద్దర్శనం కల్గుతుంది' అనే భగవద్వచనంతో భక్తియోగంయొక్క స్వరూపం, మాహాత్మ్యం ప్రకటితమౌతూ ఉంది. ఈ పంద్రెండవ అధ్యాయాన్ని అందరూ కంఠస్థం చేయాలి. ఇందులో వివరింపబడిన భక్తలక్షణాలు ప్రతిదినం మననంచేయతగినవి.





గీత అసంఖ్య రత్నముల నుత్పన్నము చేయగల అగాధ సముద్రము. జీవితకాల మంతయు నా సముద్రపు లోతునకు జేరుటకు ప్రయత్నించినను దానిలోతు తెలియరానిది; ఊహింపరానిది. శతవర్షములు వెతకినను దాని అనంత రత్న భాండారములో సహస్రాంశమైనను పొందుట దుష్కరము. కాని ఒకటిరెండు రత్నములు మాత్రమే దొరకినను దరిద్రుడు ధనికునిగను, చింతనా తత్పరుడు జ్ఞానిగను, భగవద్ద్వేషి భక్తుడుగను మారును. అట్లే శక్తిమంతుడగు కర్మవీరుడు తన జీవితోద్దేశ్యమును సిద్ధింపజేసికొనుటకై కవచధారియై కర్మక్షేత్రమున ప్రవేశించి జయమును గాంచగలడు.

Sri Aurobindo



प्रोफेसर राजा राम शास्त्री, डायरेक्टर, इन्स्टिटयूट आफ सोशल साइन्सेस
श्री काशी विद्यापीठ, बनारस - २. २७-११-५४.

किसी भी समाज के लिए एक नेता के प्रति श्रद्धा भक्ति आवश्यक है। बिना इसके समाज के कार्यों में एक सूत्रता नहीं आ सकती। इस नेता को चाहे कोई अवतार कहे या पैगंबर कहे। किसी भी समाज में योग्यता की दृष्टि से सब लोग बराबर नहीं होते। अतएव योग्यतम व्यक्ति ही नेता होता है। किन्तु नेता और उसके अनुयायियों के बीच योग्यता का अन्तर जितना अधिक होता है उतना ही नेता पर अधिक आश्रित रहना पडता है। जब अनुयायी भी पर्याप्त योग्यता रखते हैं तब वे नेता को भी अपने ज्ञान की सहायता पहुँचाते रहते हैं और इस प्रकार समाज का ज्ञान कुल मिलाकर किसी भी एक व्यक्ति के ज्ञान से अधिक होता है। इसलिए समाज में एक नेता का होना और सब लोगों के लिए उसके अनुशासन को स्वीकार करना जितना आवश्यक होता है उतना ही आवश्यक यह भी है कि सब लोग अधिक से अधिक योग्य बनें। और सब को नेता पर भी श्रद्धा हो, अपने पर भी श्रद्धा हो और सर्वोपरि समाज पर श्रद्धा हो। इसीलिए महापुरुषों के प्रति भक्ति के साथ साथ आत्म-श्रद्धा भी आवश्यक है। साथ ही साथ भक्ति का यह रूप भी बताया गया है कि **"क्रियते सर्वभूतेषु भक्तिरव्यभिचारिणी"** अर्थात् सर्वभूतों में भक्ति होनी चाहिए और सब को उसका पात्र होना चाहिए। तभी सामाजिक व्यापार ठीक चल सकता है। भक्ति का यही स्वरूप है और इस अर्थ में भक्तिमार्ग का अवलंबन किसी भी समाज के लिए अनिवार्य है। इस अर्थ में ज्ञान मार्ग से अथवा कर्म मार्ग से उसका कोई विरोध नहीं है। ज्ञानियों का ज्ञान और योगियों का कर्म भक्ति को उन्नत और परिष्कृत बनाता है किन्तु प्रत्येक अवस्था में सामजिक संगठन भक्ति के आधार पर ही होता है। प्रयत्न यह होना चाहिए कि भक्ति के साथ साथ आत्मविकास और स्वावलंबन की भावना बनी रहे और उसको श्रेय-प्राप्ति का सरलमार्ग न बना लिया जाय। जैसा कि ऐसी मान्यताओं में देखा जाता है कि कोई कैसे भी पाप कर्म करता रहे किन्तु ईश्वर का नाम लेलेने मात्र से वह सर्व दोषों से मुक्त हो जायगा।

भक्ति कर्म के कार्य-कारण नियम की बाधक न होकर उसका साधक है।

२७-११-५४. — राजाराम.

## ప్రముఖుల అభిప్రాయములు.

### గీతోక్త భక్తియోగోత్కృష్టత.

"తన అధిపతిని ఒకడు సంతృప్తి పరచదలచినప్పుడు, ఆ అధిపతే, తనను సంతృప్తి పరచే విధానాన్ని వివరించినప్పుడు, పరిచారకుడు నిస్సందేహంగా ఆమార్గాన్ని అవలంబించి విజయం పొందవచ్చు. తనను సంతృప్తిపరచగల భక్తి ఎట్టిదో భగవానుడే గీతలో రహస్యవివరణం చేశాడు. అందువలన గీతోక్త భక్తియోగంలో చేర్చవలసినవీ, తీసివేయవలసినవీ, సంశయించవలసినవివేమీ లేవు! లేవు! స్వచ్ఛ స్వచ్ఛ భక్తిస్వరూపం ఇందు నిరూపితం. ఇదే గీతోక్త భక్తియోగ ప్రాశస్త్యం.



భక్తి ఆత్మసాక్షాత్కారముయొక్క అంతిమ లక్షణమేగాక, దానిని పొందే సాధనకూడా అని గీతాశయం. ఈ అద్భుత రహస్యాన్ని మనం గీతోక్త భక్తియోగంలో తెలుసుకోగలం......"



— శ్రీ కేశవతీర్థస్వామి.

శ్రీ భగవాన్‌దాస్ స్వాధ్యాయపీఠ్,
బనారస్ - 2. 26-11-54.

### శ్రీ ఖుశాల్‌చంద్ర్ గోరావాలా,
ఎమ్. ఎ.,

శ్రీమద్భగవద్గీతా అనాసక్త కర్మయోగ కే లియే విఖ్యాత్ హై. పర్ ఇస్ పవిత్ర - గీతామందిర్ మేఁ భక్తి కీ మూర్తి భీ విరాజమాన్ హై. గీతా భక్తియోగ కా ఉపదేశ్ దేతీ హై. క్యోఁకి భక్తి అప్నే ఆరాధ్య కే అవికల్ జ్ఞాన్ హీ నహీఁ; సాక్షాత్కార్ కా శ్రీగణేశ్ కరాతీ హై. భక్తి తభీ హోతీ హై జబ్ ఆరాధ్య కే ప్రతీ ఆదర్ కీ దృష్టి హోతీ హై. అర్థాత్ భక్తి శ్రద్ధా కా రూపాంతర్ హై ఔర్ జ్ఞాన్ అథవా తన్మయతా కా మంగళాచరణ్ హై. భక్త జ్యోఁ జ్యోఁ భగవాన్ మేఁ లీన్ హోతా హై త్యోఁ త్యోఁ ఉస్ కా పరమాత్మా వివేక్ బఢ్‌తా జాతా హై ఔర్ అంత మేఁ వహ్ దేఖ్‌తా హై కి ఆత్మా ఔర్ పరమాత్మా సమాన్ హై. ఇస్ ప్రకార్ ఉసే భక్తి కే ద్వారా పూర్ణ జ్ఞాన్ అథవా సిద్ధి ప్రాప్త హో జాతా హై.

భగవాన్ అర్జున్ సే కహతే హైఁ యది స్థితప్రజ్ఞతా సమఝ్ మేఁ నహీఁ ఆతీ తో "మామేకం శరణం వ్రజ" అర్జున్ ఉన్ కీ శరణ్ మేఁ ఆతే హైఁ ఔర్ తురంత్ అప్‌నే వ్యామోహ సే ఛుట్ పా జాతే హైఁ. అర్థాత్ జో సాధక్ జ్ఞాన యోగ కో సరళతా సే నహీఁ గ్రహణ కర్ సక్‌తే ఉన్ సుకుమార మతి సాధకోఁ కే లియే భక్తి మార్గ హై. జన్ కీ దృష్టి హీ ధుంధలీ హై వే యోగ కో కైసే సున్ఁ ఔర్ సమఝేఁ? ఉన్‌హేఁ తో ప్రాథమిక్ ఉపచార్ కీ ఆవశ్యకతా హై. భక్తి

శాంతి కో దేకర్ యహీ కర్‌తీ హై. ఇస్ కీ ఆతే హీ దృష్టి స్వచ్ఛ హోతీ హై ఔర్ పరమాత్మా కే ప్రతి శ్రద్ధా బఢ్‌తీ హై.

కిన్‌తు గీతా జ్ఞాన హీన్ అంధ భక్తి కా సమర్థన్ నహీం కర్‌తీ హై. భక్తి కే నామ్ పర్ ప్రచలిత్ కేవల్ కర్మేంద్రియోం కే సంయమ్ కో వహ్ స్పష్ట రూప్ సే మిథ్యాచార్ కహాతీ హై. గీతా కీ దృష్టి మేం భక్తి 'సత్ సాధన్' హై - సాధ్య నహీం హై. అతఏవ వహ్ భీ పరమాత్మా ప్రాప్తి కా నిశ్చిత మార్గ హై.

26_11_54. ఖుశాల్‌చంద్ గోరావాలా.

ఓం

శ్రీ కృష్ణచరణ్, ఎమ్. ఏ.,
సాహిత్య విద్యాప్రవీణ & వేదాంతాచార్య.

పరివ్రాజక మహామండలి.
బనారస్_1. 25_11_54.



కర్మ భక్తి జ్ఞానములను మూడు యోగములలో భక్తియోగము, కర్మయోగమునకు పరమప్రాప్యమై, సాధ్యమై, జ్ఞానయోగమునకు ఉత్తమోత్తమసాధనమై కర్మజ్ఞానముల రెంటినడుమ మధ్యమణివలె విరాజిల్లుచున్నది. ఈ భక్తి సర్వజన సులభమైనది. విశేషించి యీ కలియుగములో భక్తియే ముక్తికి హేతువని స్మృతులు ఉద్ఘోషించుచున్నవి. జ్ఞానము ఉత్తమ సంస్కారముగల యే కొద్దిమందికో మాత్రమే లభ్యము. భక్తి హృదయమునకు సంబంధించినది. జ్ఞానము బుద్ధికి సంబంధించినది. నిశిత బుద్ధితో తర్కజాలములో చిక్కుకొన్నచో దైవప్రాప్తి అసంభవము. కాన ఆత్మార్పణబుద్ధిపూర్వకమైన అనన్య భక్తియోగమును అభ్యసింపవలయును. అనన్య భక్తియే ముక్తికి జ్ఞానమునకు మూలకారణము. అనన్యభక్తియుక్తుడగు భక్తుని సంసార సముద్రమునుంచి వెంటనే ఉద్ధరింపగలనని శ్రీకృష్ణ భగవానుడు స్వయముగ వచించెను. ఈ చిన్న అధ్యాయములో భక్తిప్రభావమును, ఉత్తమ భక్తుని లక్షణములను విశదముగ నిరూపించుచు శ్రీకృష్ణుడు 'తేషామహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్' అని భక్తజనోద్ధరణకై అభయ హస్తముతో భక్తుల నాహ్వానించుచున్నాడు.

గీతాభక్తులారా! రెండు. ఆలస్యమెందులకు! శీఘ్రమే రెండు. భగవద్వచనమును విశ్వసింపుడు. అనన్యభక్తిని అభ్యసింపుడు. సంసారాంబుధిని దాట యత్నింపుడు. భగవత్ప్రోక్తములగు అద్వేష్టృత్వాది ధర్మముల నిత్యము మననము చేయుడు. ఆచరించుడు. ధన్యులు గండు. ఇక ముక్తి మీ చేతులలోనిదే.



— కృష్ణచరణ్.

श्री हरिः

हनुमान प्रसाद पोद्दार

गीता प्रेस,
२९-११-'५४.

श्री श्रीकण्ठम जी,

सप्रेम हरिस्मरण। गीता साहित्य सेवा समिति के नेतृत्व में आन्ध्र में गीता जयन्ती मनाई जा रही है, सो बड़े आनन्द की बात है। गीतावाणी पत्रिका के जयन्ती विशेषांक के लिए लेख या सन्देश भेजने के लिए समय तो नहीं रहा, परन्तु मैं नीचे दो-एक लाइन लिख रहा हूँ। काम में आ सकें तो ले सकते हैं।

"गीतोक्त भक्तियोग का औचित्य सभी आचार्यों द्वारा स्वीकृत है। भगवान ने गीता में भक्ति की बाहरी बातों पर उतना जोर न दे कर भक्त के जीवन में प्रकट होनेवाले लक्षणों के आधार पर अपने प्रिय भक्तों का वर्णन किया है। गीता अध्याय १२ श्लोक १३ से २० तक का यह प्रसंग है। गीतोक्त भक्त कैसे होना चाहिए, इसका पूरा स्वरूप इस में प्राप्त होता है।"

मैं विशेषांक के कार्य में अत्यन्त व्यस्त रहा, इसलिए उत्तर नहीं लिख सका करबद्ध क्षमा चाहता हूँ।

शेष भगवत्कृपा

गीता प्रेस,
गोरखपुर,
२९-११-५४.

भवदीय -
हनुमानप्रसाद पोद्दार
सम्पादक
कल्याण तथा कल्याणकल्पतरु.

# गीता में उदार भक्तिवाद

✱

* गीता को धर्म का सर्वोत्तम ग्रन्थ मानने का यही कारण है कि उस में ज्ञान, कर्म और भक्ति – तीनों योगों की न्याययुक्त व्याख्या है; अन्य किसी भी ग्रन्थ से इसका सामंजस्य नहीं है।

* ऐसा अपूर्व धर्म, ऐसा अपूर्व ऐक्य केवल गीता में ही दृष्टिगोचर होता है। ऐसा अद्भुत धर्म व्याख्या किसी भी देश में और किसी भी काल में किसी ने भी की हो, ऐसा जान नहीं पडता।

* ऐसा उदार और उत्तम भक्तिवाद जगत में और कहीं भी नहीं है।

— बंकिम चन्द्र.

---

శ్రీ జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.,
లెక్చరర్ - విజయవాడ.

ముకాం - నూచవరం,
26-11-54.

★

"భగవద్గీతా గ్రంథమున షట్క్రత్రయములో మధ్యమణివలె భక్తిషట్కము విరాజిల్లుట వలననే భక్తియొక్క సర్వావభాసకత్వము సూచితమగుచున్నది. ఇటుకర్మకుజీవకమై యటు జ్ఞానమునకుద్దీపకమై స్వయముగకూడ భగవత్సాన్నిధ్య ప్రాపకమై విరాజిల్లునది భక్తి. భక్తి విలసితముకాని శుష్క నిష్కామకర్మ సచ్చిదానందప్రాప్తి కెన్నడును సాధనము కాజాలదు. మోక్షహేతువైన జ్ఞానము పరమేశ్వరానుగ్రహము లేకుండా లభ్యము కాజాలదు. కావున భక్తి దేహళీదీపన్యాయముచేత నుభయపార్శ్వములను తన ప్రాభవమును ప్రసరింపచేయుచున్నది. ఈ జన్మలో జ్ఞానోదయము కాకపోయినను సగుణ బ్రహ్మోపాసనము పరిపక్వమైనచో సాధకునకు చతుర్ముఖ బ్రహ్మలోక ప్రాప్తియు క్రమముక్తియు గలుగును ఔపనిషదసిద్ధాంతము గీతాష్టమాధ్యాయమున సూచింపబడుటచేత కూడా భక్తియొక్క కర్మజ్ఞాన మధ్యమత్వమును సూచింపబడుచున్నది............."

— జ. పురుషోత్తము.

( ★ మిగిలినది మరు సంచికలో — ఎడిటర్. )

# మహారాజపోషకులు



పడిశాల గురుచరణంగుప్త రాజమ్మగార్ల
స్మారకముగ కుమారుడు
శ్రీ భద్రయ్యగారు, వరంగల్.



శ్రీ సమయమంతుల
నాగేశ్వరరావుగారు,
ర్యాలి.





శ్రీరాజులపాటి వేంకటేశ్వర్లుగారు,
పాలకొల్లు.



స్వర్గీయ శ్రీమతి అద్దేపల్లి శేషరత్నమ్మ
స్మారకముగ భర్త
శ్రీ సత్యనారాయణగారు, పాలకొల్లు.



# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

— కర్నూల్ జిల్లా —

1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు
2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీసీతారామాశ్రమం, గుళ్లదూర్తి, కోయిలకుంట్ల తా॥
3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా
4. స్వర్గీయ నేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల.
5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తాలూకా.
6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥
7. శ్రీ తొమ్మండ్ర రామసుబ్బయ్యశ్రేష్ఠిగారు, చాగలమర్రి.
8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము, శిరివెళ్ళ తాలూకా.
9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ.
10. శ్రీ జి. వీరారెడ్డిగారు, బి.ఎం. ఎర్రగుడిదిన్నె, ఎర్రగుంట్లపోస్టు.
11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల.
12. శ్రీబొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, ఆళ్లగడ్డ, P.O.

— కడపజిల్లా —

13. శ్రీహిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, పాలగిరి పోస్టు.
14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్.
15. శ్రీపోలేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

— అనంతపురం జిల్లా —

16. పూజ్యపాద శ్రీ చిద్గగనానంద మహర్షులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం.
17. శ్రీ పోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు.
18. శ్రీ పి. నరసింహశాస్త్రిగారు, తాలూకా హెడ్ అకౌంటెంటు, కల్యాణదుర్గం.

— చిత్తూరు జిల్లా —

19. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్ వీధి, చిత్తూరు.
20. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు.

— నెల్లూరుజిల్లా —

21. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్ పేట, నెల్లూరు.
22. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

— గుంటూరు జిల్లా —

23. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, వెరవలిపోస్టు, (తెనాలీ)

— కృష్ణాజిల్లా —

24. శ్రీధూర్జటి సుబ్రహ్మణ్యంగారు, బందరు.
25. శ్రీభట్టిప్రోలుసత్యనారాయణరావుగారు. సర్కిల్ పేట, బందరు.

# గీతావాణి — పోషకవర్గము.

— తూర్పుగోదావరి జిల్లా —

26. శ్రీ సమయమంతుల నాగేశ్వరరావుగారు, ర్యాలి.

— పశ్చిమ గోదావరి జిల్లా —

27. శ్రీరాజులపాటి వేంకటేశ్వరులుగారు, పాలకొల్లు.
28. స్వర్గీయ శ్రీమతి అద్దేపల్లి శేషరత్నమ్మగారి స్మారకముగ - భర్త శ్రీ సత్యనారాయణమూర్తిగారు, పాలకొల్లు.

— నైజాంస్టేట్ —

29. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది.
30. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్
31. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం, కేశవపట్నం, కరీంనగర్ జిల్లా.

— మైసూరుస్టేట్ —

32. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హొస్పేట్
33. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హొస్పేట
34. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణదేవరకెరె.
35. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట,
36. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి.

—మద్రాస్ రాష్ట్రం

37. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానూరు, ఉత్తర ఆర్కాడుజిల్లా.
38. శ్రీగంథే వరసయ్యశ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్ళవీధి, మద్రాసు.

## రాజపోషకులు రు. 54

— కర్నూలు జిల్లా —

1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యపురాజుగారు, గోసపాడు.
2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం.
3. శ్రీ చాటకొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ.
4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ.
5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ.
6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ.
7. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ.
8. శ్రీ లక్కిరెడ్డిహనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా.
9. శ్రీ N. రామిరెడ్డిగారు,డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తాలూకా.
10. శ్రీ మదళ్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి.
11. శ్రీ జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు,చాగలమర్రి.

12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మగారు, నంద్యాల.
13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల.
14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, కోయిలకుంట్ల.
15. శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం.
16. శ్రీ శాగం చిన్నకొండారెడ్డిగారు, పేరూరుగ్రామం, యర్రగుంట్ల పోస్టు.
17. శ్రీ జి. సి. బాలన్నగారు, రిటైర్డ్ తహసీల్దారు, ఆళ్లగడ్డ.
18. శ్రీ యం. చిన్నఈశ్వరరెడ్డిగారు, ఐలూరుగ్రామం

— కడప జిల్లా —

19. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా॥
20. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు.
21. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు.
22. శ్రీ పెంటంశెట్టి శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి.
23. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు.
24. శ్రీ ముమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా.

— అనంతపురం జిల్లా —

25. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి.
26. శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ.
27. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు.
28. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు.
29. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మిణకనగుర్కి.
30. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, ఆలూరు తా॥
31. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి.
32. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి.
33. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి.
34. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి.
35. శ్రీ చిన్నకదిరప్పగారు, కుందనగుర్తి.
36. శ్రీసాధు శివలింగప్పగారు, కుందనగుర్తి.
37. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి
38. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి.
39. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి.
40. శ్రీ పాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.
41. శ్రీ మ్యాడం అశ్వత్థప్ప అండ్ సన్సు, కంబళిమర్చంట్, కల్యాణదుర్గం.

42. శ్రీ కానుల శరభయ్య శ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం.
43. శ్రీ బెల్లంకొండ రామప్పగారి వెంకటరమణప్ప కుమారుడు తిమ్మప్ప శ్రేష్ఠిగారు, జనరల్ మర్చంట్, కల్యాణదుర్గం.
44. శ్రీ గాధంశెట్టి లక్ష్మక్క కుమారుడు సుబ్బరాయుడు, కల్యాణదుర్గం.

— చిత్తూరు జిల్లా —

45. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట.
46. శ్రీ బల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె.
47. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ. పెరియంబాడి.
48. శ్రీ నటకల రామనాధం శ్రేష్ఠిగారు, చిత్తూరు.

— నెల్లూరు జిల్లా —

49. శ్రీ బ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కనుపర్తిపాడు.

— కృష్ణా జిల్లా —

50. ముక్కామల సీతయ్యగారి జ్ఞాపకార్థము ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మగారు, ఈడ్పుగల్లు.
51. శ్రీ బావినేని రామకోటయ్యచౌదరి, పరమాత్మానందాశ్రమము, గీతాభవనం పెనమలూరు.
52. శ్రీ ఆదూరి చలపతిరావుగారు. రుస్తుంబాద్, బందరు.
53. శ్రీ మోటుమర్రి దయానిధిగారు, బందరు.

— తూర్పుగోదావరి జిల్లా —

54. శ్రీసమయమంతుల పెద్దనాగేశ్వరరావుగారు, ర్యాలి.
55. శ్రీ సమయమంతుల జగ్గారావు & బ్రదర్స్, ర్యాలి.
56. శ్రీ సమయమంతుల రాధాకృష్ణరావు & బ్రదర్స్, ర్యాలి.
57. శ్రీ మాధంశెట్టి జగ్గారావుగారు, ర్యాలి.
58. శ్రీ మాతంశెట్టి నాగరాజరావుగారు, ర్యాలి.

— పశ్చిమగోదావరి జిల్లా —

59. శ్రీ అబోతుల రామన్నగారు, పాలకొల్లు.
60. శ్రీ మామిడి సత్యనారాయణగారు, పాలకొల్లు.

— నైజాం స్టేట్ —

61. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ.
62. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ.
63. శ్రీ నాగబండి విశ్వనాధంగారు, 12/88 మైక్రోడు, వరంగల్.
64. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృశింహ భక్తమండలి 12/285, గిర్మాజీపేట, వరంగల్.

# గీతావాణి – పోషకవర్గము.

65. శ్రీ గండె రాజయ్యగారి లింగయ్యగారు, కిరాణదుకాణం, వరంగల్
66. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు, కిరాణదుకాణం, వరంగల్
67. శ్రీ తాటికొండ నాగయ్యగారు, రామన్నపేట, వరంగల్
68. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, అడితిదుకాణం, వరంగల్
69. శ్రీ మదూరు బసవలింగంగారు, వరంగల్
70. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్
71. శ్రీ యాదా నారాయణగారు, వరంగల్
72. శ్రీ గునిశెట్టి నాగలింగంగారు, వరంగల్
73. శ్రీ తోటి జగన్నాథంగారి ముక్తేశ్వర్ గారు, కిరాణం మర్చంట్, వరంగల్
74. శ్రీగన్ను బుచ్చయ్యగారు, అడితి దుకాణం, వరంగల్.
75. శ్రీమతి కామేశ్వరమ్మగారు c/o రవ్వా కైలాసంగారు, బట్టలదుకాణం, వరంగల్
76. శ్రీ సోమా నరసయ్యగారు, వరంగల్
77. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్
78. శ్రీ చందా పుల్లయ్యగారు, జనరల్ మర్చంటు, వరంగల్
79. శ్రీ చిదిరాల రాజశేఖరంగారు వరంగల్
80. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, బట్టల దుకాణం, వరంగల్.

— మైసూర్ రాష్ట్రం —

81. శ్రీ కాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హొస్పేట్
82. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట.
83. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట.
84. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట.
85. శ్రీ నారాయణమూర్తిగారు, c/o సూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి కోలారు.

శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

— మద్రాసు రాష్ట్రం —

87 శ్రీ శంకరనాయుడుగారు, కార్యాలు, ఉత్తర ఆర్కాడు జిల్లా.
88. శ్రీ సి. ఎస్. నాగరాజశ్రేష్ఠిగారు, కొళ్లేగాలం, కోయంబత్తూరుజిల్లా.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు-16.
2. శ్రీ గజ్జహళ్లి నాగిరెడ్డిగారు, వండవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)
3. శ్రీమతి లంకా భాగీరథమ్మగారు, పొన్నమ్మగుడివీధి, చిత్తూరు.



# వ్యాసకర్తలకు విన్నపము.



1. వ్యాసములను 'శ్రీరామకృష్ణ, ప్రబంధ సంపాదకుడు, గీతావాణి ఆఫీసు – అళ్ళగడ్డపోస్టు' అను అడ్రెసుకు పంపవలెను.

2. వ్యాసములను కాగితమునకు ఒక్కవైపు విడివిడిగ సిరాతో వ్రాసి పంపవలెను. వ్యాసములు గ్రాంథికభాషయందైనను, వ్యావహారిక భాషయందైనను ఉండవచ్చును.

3. వ్యాసములు కేవలము భగవద్గీతా తత్త్వమునకు సంబంధించినవై యుండవలెను. ఏదో ఒక ముఖమున గీతతోడి సంబంధమును ముడిపెట్టుకొని యున్నకాని; లేనిచో ఆ వ్యాసములు అంగీకరింపబడవు.

4. వ్యాస రచయితల అభిప్రాయములనుగురించి సంపాదకునకు బాధ్యతలేదు.

5. వ్యాసలేఖకులు తమ పూర్తి చిరునామాను ప్రతిసారి వ్రాసి పంపుచుండవలెను. రచయితలు తమ ఫోటో పంపినచో కార్యాలయ పక్షమున బ్లాకు చేయించి వీలైనపుడు పత్రికలో ముద్రింతుము. విశేష సంచికయందు నియతముగ వ్యాసకర్తయొక్క ఫోటో వారివ్యాసముతో పాటు తప్పక ముద్రింపబడగలదు.

6. వ్యాసరచయితలకు పత్రిక రెండేసి ప్రతులు పంపబడును.

7. ముద్రింపబడని వ్యాసములను వ్యాసకర్తలు కోరినచో వెనుకకు పంపబడును.

8. వ్యాసములను ప్రకటించుటకును, ప్రకటింపకుండుటకును, సంక్షేపించుటకును సంపాదకునకు పూర్తిగ స్వేచ్ఛకలదు.

— మేనేజింగ్ ఎడిటరు.
గీతావాణి.



ఓమ్

# విషయసూచిక - డిసెంబర్ '54





# ప్రకటన.

భగవద్గీతా పరమార్థ చంద్రికా వ్యాఖ్యాన సహితము ఆరు సంపుటములు, మా గీతావాణీ కార్యాలయమునకు కావలసియున్నది. ఇచ్చుటకు యిష్టపడువారు వెలతో సహా మాకు తెల్పినచో తెప్పించుకొందుము.

సంపాదకుడు.

గీతావాణి.




సంపుటి 4    స్వస్తిశ్రీ జయ – మార్గశిరమ్.    సంచిక 6


## సంపాదకుని

రమపవిత్రమైన భక్తియోగాన్ని గ్రంథరూపంలో వ్రాసి నా అంతరాత్మ ఏదో అవర్ణనీయమైన సంతృప్తిని అనుభవించింది. "భగవంతా! ఈ జీవికి యిలాంటి స్వర్ణ సన్నివేశాలను దయచేసి నీ సేవ చేయించుకో"మంటూ అంతర్వాణి అప్రయత్నంగా పల్కింది. ఇదో! మా వోపినంతా మేం చేశాం. మీదటి కార్యభారమంతా భక్త మహాజనులపై ఆధారపడి వుంది. వారి స్వధర్మాన్ని వారు నిర్వహిస్తురుగాక!

కోలారుజిల్లా బంగారుపేట (బౌరింగ్ పేట) వాస్తవ్యులు – సుప్రసిద్ధ వదాన్యులు - నిరంతర భగవత్సేవాధురంధరులు - శ్రీయుత ఎం. వి. రామలింగంశ్రేష్ఠి అండ్ సన్సు వారు తాము నిర్మించిన మురళీ మాధవ ధర్మశాలలో ప్రతియేటా శ్రీరామకోటి సప్తాహ మహోత్సవాలు జరుపుట పరిపాటి. ఆ సందర్భాన్ని పురస్కరించి

7-4-1954 నుండి వారంరోజులు యిరుపూటలా పూజ్యపాద శ్రీ శంకరానందస్వాములవారొసగిన భక్తియోగోపన్యాసముల పరిష్కృతరూపమీ గ్రంథం. శ్రీవారి హిందీ వుపన్యాసాన్ని భాగవత కుటుంబానికి చెందిన శ్రీ సేగు వేణుగోపాలగుప్తగారు అనువదించారు. శ్రీశంకరానందస్వామివారి భక్తకోటిలో నొకడు - ఒచ్చెము లేని గురుసేవాతత్పరుడు – మామిత్రుడు చాగలమర్రి నివాసి శ్రీ సుంకు రామయ్యగారు ఆ వుపన్యాసములను ఎప్పటికప్పుడు పొడ గుర్తులతో చిత్తుప్రతి వ్రాసిపెట్టారు. ఆ ప్రతిని సంస్కరించి - సవరించి విషయ విభాగదృష్టితో ఆరు వుపన్యాసములుగ ఏర్పరించాను. ఆ ఆరువుపన్యాసాల సంపుటే యీ పుస్తకం.

ప్రతిసారీ గీతాజయంతీ పర్వదినాన్ని వుపలక్ష్యంగా పెట్టుకొని గీతావాణి విశేష సంచికను పాఠకులకు సమర్పించుట మా అనుస్యూతమైన పద్ధతి. ఈ సంవత్సరము గతంవలెకాక క్రొత్త పుంత ననుసరించి యీ భక్తియోగ సంచికను చదువరుల కరాంజలులలో సమర్పిస్తున్నాము. ఈ పద్ధతి బహుజనప్రియమై వొప్పినచో మీదమీదకూడ యిదేమార్గము ననుసరించాలని మా అభ్యూహ.

గ్రంథంమొత్తం వ్యావహారికభాషనే వాడాను. మా కడప కర్నూలు జిల్లాలవారు విశేషించి వ్యవహరించే మాండలిక పదాలు సైతం యిందులో చేరివుంటాయి. మారుమూలల్లోని మాటలకు సైతం జీవంపోసి భాషాక్షేత్రాన్ని విస్తారంచేయాలనే ఉత్సుకత నన్నీ పనికి పురికొల్పింది. ఎందరెన్నివిధాల కాదన్నా వ్యావహారిక భాష యీనాడు జనసామాన్యంలో బహుమతాన్ని సాధించిందనే విషయం సత్యప్రియులు వొప్పుకోక తప్పదు.

ఈ అమృతప్రసాదాన్ని ఆరగించి ఏ ఒక్క భక్త హృదయమైనా తృప్తి వహించిందంటే మా పరిశ్రమకు అదే సాఫల్యం.

"త్వదీయం వస్తు గోవింద! తుభ్యమేవ సమర్పితమ్॥"



# భక్తియోగ ప్రతిపాదకులు.





స్వామి శ్రీ శంకరానంద,

ఉపన్యాసకులు.



స్వామి శ్రీ రామకృష్ణ,

అనువాదకులు.

ఓమ్.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

శ్రీ శంకరానందస్వాములవారి

# భగవద్గీతోపన్యాసములు.

# భక్తియోగము

మకాం - బంగారుపేట. 7—4—1954.

ప్రియమైన ఆత్మబంధువులారా!

సర్వాంతర్యామియైన భగవంతుని మహాదనుగ్రహంతో, మనమీ పవిత్రస్థానంలో — పవిత్రకార్యక్రమంలో సమావేశమై వున్నాం. నిజానికి సత్కర్మచేయాలనే సత్సంకల్పం కలగాలంటే, అది అనేక జన్మార్జిత పుణ్యభాగ్యంతో — అంతేకాదు, భగవంతుని అపార అనుగ్రహంతోనే సిద్ధించాలి. మన మేపని చేయాలన్నా ప్రకృతిని ఆశ్రయించే చేయాలి. ఈ ప్రకృతి యెవరిసొత్తు? అది నీదీకాదు; నాదీకాదు. ఆ పరమాత్మునిది. ఆయన సానుకూలమైనపుడే ప్రకృతిలో మనం మన కార్యాలను సాధించేది. అదితప్ప, మానవుడు తన ప్రయత్నంతోనే ప్రకృతిని సాధిస్తాననుకోడం సుతరాం పొరబాటు. దీనికొక దృష్టాంతం చెబుతాను. రావణుడు బ్రహ్మవంశంలో పుట్టాడు. నాల్గు వేదాలను అధ్యయనం చేశాడు. ఘన ఘోరమైన తపస్సులూ చేశాడు. భగవంతుని వదిలి ప్రకృతిని ఆరాధించాడు. ఆ ప్రకృతిని తన స్వాధీనం చేసుకోవాలని తంటాలు పడ్డాడు. రాముని వదలి సీతనుకోరాడు. వాని కోర్కెలన్నీ బుగ్గిపాలయ్యాయి. వానిపౌరుషం వానిప్రయత్నం చివరికి వానినెత్తే అణిచింది. భగవంతుని ప్రసన్నుని చేసుకోక ప్రకృతిని ఉపభోగించాలనే ప్రయత్నాలన్నీ మంటకలియకపోవు. భగవంతుని అనుమతిబొంది ప్రకృతిని వశం చేసుకొని మన సంకల్పాలను — మన కార్యాలను సాంగమంగళప్రదం చేసుకోవచ్చు.

మన ప్రస్తుతప్రసంగం, భగవద్గీతలోని పంద్రెండవ అధ్యాయాన్ని గురించి. ఈ అధ్యాయానికి భక్తియోగమనిపేరు. అధ్యాయాన్ని ఆరంభించే ముందు కొన్ని తొలిపలుకులు పలికి ప్రకృతానికి వస్తాను.

భగవద్గీతతో మనకు సంబంధమేమిటి? దాన్ని మనమెందుకు పఠించాలి? పారాయణమెందుకు చేయాలి? ఎందుకు ధ్యానించాలి? ఈ విషయానికి తార్కాణమొకటి చెప్తాను. నీవు కాశీకి పోవలెనని బయలుదేరావు. మధ్యలో విజయవాడ చేరావు. ఒకానొక ధర్మశాలలో మకాంవేశావు. ఆ వూరివాడొకడు నీకు తటస్థించాడు. "అయ్యా! మీరెక్కడనుండి వచ్చారు? ఎక్కడ పోతూన్నా"రని నిన్నడిగాడు. "నేను బంగారుపేటనుండి వచ్చాను. కాశీకి పోవలె"నని నీవు చెప్తావు. ఆవిధంగానే జీవుడు స్వస్థానాన్ని వదలి ప్రయాణమై, యీ మానవలోకానికి వచ్చాడు. 'ఎన్ని జన్మములాయెనో' - ఈ ప్రయాణం సాగుతూనే వుంది. దీనికి తెగ్గతెంపు లెక్కడివి? అసలు - ఎక్కడికిపోవాలని యీ ప్రయాణం? "కస్త్వం కోఽహం కుత ఆయాతః" – అని పెద్దలూ శాస్త్రాలూ మనల్ను అడుగుతూన్నారు. మనము వారిమాటను పెడ చెవిని పెట్టాము. మనవద్ద చెప్పదగిన సమాధానములేదు. కాబట్టే మూగనోము బట్టి, గ్రుడ్డిమెద్దు చేలో పడ్డట్లు ఎట్లో జీవయాత్ర సాగిస్తూన్నాము. మనయాత్రకు గమ్యంలేదు; ధ్యేయం లేదు; లక్ష్యంలేదు. "అచ్చపుం జీకటిం బడి" మన మహా ప్రస్థానానికి పుట్టుపూర్వోత్తరాలను మరిచాము. పెద్దలు చేతులెత్తి చెబుతూన్నా, శాస్త్రాలు భేరీ నినాదాలు చేస్తూన్నా, మనం మన కుంభకర్ణ నిద్రనుండి మేల్కొనేటట్టు లేదు.

ఒక ఉపమానం వినండి. మీవూరిదగ్గర ఒక జీవనది వుంది. దాని గట్టుపై నిలబడి చూడండి. ఆ నదికి తీరికేలేదు. తనపనే తనది. తనలోకమే తనది. ఏసుద్దీ పట్టదు. అటు చూడదు; ఇటు చూడదు. క్షణమాత్రం పురసత్తులేదు. "అమ్మా! నదీదేవతా! ఎక్కడికి నీ వురుకులు పరుగులు? ఎక్కడికిపోతే నీ ప్రయాణానికి శాంతి? నీకు విశ్రాంతి?" అని అడుగుదాం. ఊహూం, అది జవాబే చెప్పదు. జవాబు చెప్పేతీరుబాటు దానికెక్కడిది? దూషణభూషణాలతో పట్టింపులేక – రాగద్వేషాలతో జోక్యంలేక, హుటాహుటి హోరాహోరి ఒక టేపయనం. ఎక్కడికి? త

పతీ — తన గతీ అయిన సముద్రుని ఒడిలోపడి తదైక్యం చెందేకోసం. ఎందుకు? — సముద్రమే తన స్వస్థానం, తన స్వగృహం. ఎట్లంటారా? నదీ జలాలు మొదట్లో సముద్రరూపంగానే వుండినవి. అవి సూర్యకిరణాల ద్వారా ఆవిరై — మేఘాలై — వానై — నీరై — నేలపైబడి వాగులై వంకలై మహానదీ రూపంతో, యిపుడు కొండలు గుట్టలు అడవులు అరణ్యాలు త్రోసుకుంటూ, రాసుకుంటూ, సూటిగానో చుట్టు తిరిగో— తన మూలస్థానమైన సముద్రంలో కలిసేకోసం, అంతింతనరాని ఆదుర్దాతో— తాళుకోలేని తహతహతో, యేకధాటిగా ప్రయాణం చేస్తూంది. ఇది నదియొక్క ఆత్మకథ.

ఇట్టిదే మనకథకూడా. జీవుని జీవననదిస్సైతం తన మూలస్థానాని కేసి ప్రవహిస్తూంది. "జీవో దేవస్సనాతనః" — అవిద్యా ప్రభావంతో సచ్చిదానందరూపుడగు పరమాత్మునికి దూరమై, సంసారక్షేత్రంలో దొర్లిపొర్లి యెన్నో నామాలు — యెన్నో రూపాలు ధరించి, తిరిగీ సచ్చిదానంద పరబ్రహ్మమనే మహాసాగరంలో తదైక్యమయ్యేకోసం, అనాదికాలంనుండీ జీవుడు పరితపిస్తూన్నాడు. అక్కడికి చేర్తేనేకాని వానికి నిత్యశాంతి లేదు.

ఓ మూఢమానవుడా! నదిచెప్పే గుణపాఠాన్ని హృదయానికి గ్రుద్దుకో! ఈ లోకము నీలోకముకాదు. వెయ్యేల? బ్రహ్మలోక పర్యంతాలైన లోకలోకాలన్నీ నీ స్వస్థానాలుకావు. అవి నీకు మజిలీలు మాత్రం; మకాములుమాత్రం. "ఆబ్రహ్మ భువనాల్లోకాః — పునరా వర్తినః" — దివికి భువికి ఏతం బానలాగా పరిభ్రమించే గ్రహచారం నీకెందుకు? "యద్గత్వా న నివర్తంతే — తద్ధామ పరమం మమ" — ఆ పరమధామాన్ని, ఆ తిరిగిరానిచోటును చూచుకో! ధ్రువబాలకునివలె చిరస్థాయిగ ధ్రువస్థానాన్ని చేరుకో. సచ్చిదానంద పరబ్రహ్మప్రాప్తి అంటే అదే. దానికి మరోపేరు మోక్షం.

కాశికి పయనమై పోయేవాడు మార్గమధ్యంలో విజయవాడ లోనే ఆగిపోవచ్చా? ఆగిపోరాదు. పోనీ; వెనుక్కురావచ్చా? అదీ సరి కాదు. ముందుకే పోవాలి. ముందుకే పోయి కాశీ చేరాలని అభిలషిం చాలి; శీఘ్రంగా చేరేటందుకు తగిన గట్టి ప్రయత్నాన్ని చేయాలి.

"ఎప్పుడో ఒకప్పుడు చేరవచ్చులె"మ్మని జాఢ్యంగా పడివుండుట పురుషార్థపరుని లక్షణంకాదు. ప్రకృతి వశతః యేనాడో లభించేవస్తువును వీలైనంత తొందరలో పొందాలని ప్రయత్నించుట, పురుషార్థపరుడగు మానవునిలో సహజంగా వుండవలసిన లక్షణం.

నేనొకరోజు మీ యింటికివచ్చాను. మీరు నన్నాదరించి కూచోబెట్టారు. ఈ కాలం ఫేషన్ ప్రకారం ఒక కప్పు కాఫీ తెచ్చి త్రాగమని నాదగ్గరవుంచారు. ఈ కలికాలపు సభ్యమానవుని సత్కారానికి యోగ్య వస్తువులు రెండు. ఒకటి కాఫీ; రెండవది సిగరెట్టు. సరే! — మీరిచ్చిన కాఫీ నిండావేడిగావుంది. వేరే మరోగ్లాసు (లోటా) తెమ్మని అడిగాను. మీరు తెచ్చియిచ్చారు. వాటితో తిరుగపోసుకొని చల్లార్చుకొని ఆ కాఫీని త్రాగాను. మీరు యిచ్చిన కాఫీ కప్పును — అదెంత వేడిగా నుండనీ గాక, పదినిముషాలపాటు వూరక అట్లే పెట్టితే, దానిపాటికదే — వేరేగ్లాసుతో పనిలేకుండా, ఆరిపోయేదే. కానీ, అంతసేపు వూరకుండే నిబ్బరంలేదు. కాబట్టే మరోగ్లాసు తెమ్మన్నాను. తెప్పించుకొని తిరుగబోసుకొని త్రాగాను.

మానవునిలోని పురుషార్థంకూడా అట్టిదే. ప్రకృతి ప్రవాహంలో యేనాడో ఓనాడు, మనకు ముక్తివస్తుందని కూర్చోరాదు. పురుష ప్రయత్నాన్ని సార్థకంచేసి ఆ ఫలాన్ని సద్యః పొందాలి. కాశీకి పోవాలనుకొన్నవాడు ఏనాడో ఒకనాడు చేరవచ్చులెమ్మని తాత్సారంగా వుండడు; ఉండరాదు. వీలైనంతత్వరలో చేరేటందుకు తగిన వుపాయం చూచుకొంటాడు, చూచుకోవాలి.

నీవు మద్రాసు పోవాలనుకొన్నావు. నడిచిపోతే పదిరోజులు పడ్తుంది. ఎద్దుబండిపైపోతే వారందినాలకు పోతావు. బస్సుపైపోతే ఒక్కరోజులో చేర్తావు. రైల్లోపోతే అర్థరోజులో పోగల్గుతావు. విమానంలో వెళ్లితే ఒకగంటలో చేరుకోవచ్చు. దూరమెంతైనా వుండనీగాక! అవలంబించిన వాహన వేగాన్నిపట్టి ప్రయాణకాల పరిమితి వుంటుంది. మంచి సాధనాన్ని అవలంబిస్తే త్వరలో చేరుకొంటావు. అంతేకాదు; నడిచిపోయేవానికి — బండిపై బస్సుపై పయనంచేసే వానికి కొన్ని ఆటంకాలు, కొన్ని ఆతంకాలు కల్గినా కల్గొచ్చు. విమా

నంలోనైతే శీఘ్రంగానే వెళ్లొచ్చు; కాని తప్పితే అది ప్రాణాంతకం. అటుగాక, రైలుప్రయాణమైతే ఒక మోస్తరుగా నిరపాయమైంది. కొంత మట్టుకు శీఘ్రంగానూ పోవచ్చు.

భగవత్ప్రాప్తిని — ముక్తిని గోరే మానవజీవునికి భగవద్గీత కొన్ని వుపాయాలను చెప్పింది. గీతచెప్పిన విధానాల ననుసరించి మనము మన స్వధామాన్ని చేరుకోవచ్చు; మన పరమప్రయోజనాన్ని సాధించవచ్చు. అధికారి భేదాన్నిబట్టి అది కర్మభక్తి జ్ఞానాలను బోధించింది. కర్మమార్గము యెద్దుబండివంటిది. జ్ఞానమార్గము విమానమువంటిది. భక్తిమార్గము రైలుప్రయాణము వంటిది. రైలువంటి భక్తిమార్గం ద్వారా సుఖంగా — నిరపాయంగా గమ్యస్థానాన్ని జీవుడు చేరుకోవచ్చు. ఆ భక్తిమార్గమే ముఖ్యంగా యీ పండ్రెండవ అధ్యాయంలో చెప్పబడింది. కాబట్టే యీ అధ్యాయానికి భక్తియోగమని పేరు.

గంగానది గంగోత్రిలో ఉద్భవిస్తుంది. కలకత్తావద్ద సముద్రంలో కలుస్తుంది. దాని ప్రవాహరేఖ సుమారు యిర్వై అయిదువందల మైళ్ల పొడవుండొచ్చు. మొత్తానికి గంగాప్రవాహము ఆద్యంతమూ పవిత్రమైందే. గంగాజలాన్ని అత్యంత మహిమోపేతంగా మనవారు తలుస్తారు. ఒకసారి జర్మనీనుండి ఒకడాక్టరు కాశీకి వచ్చాడు. గంగాజలాన్ని పరీక్షించాలని తలచి ఆయన ఒక సీసానిండా ఆ నీటిని తీసుకొన్నాడు. మరోసీసానిండా మామూలు భావి (నూతి) నీరు తీసుకొన్నాడు. రెండు సీసాలలోను కలరాక్రిములను వదిలాడు. భావినీటిలో ఆ క్రిములు తండోపతండాలుగ వృద్ధిచెందాయి. గంగాజలంలో వేసిన క్రిములు మలమల మాడిపోయాయి. భౌతికదృష్ట్యాకూడా గంగాజలంలో క్రిమినాశక శక్తి వుంది.

గంగానది ఆద్యంతము పవిత్రమే అయినా, దాని పవిత్రత కొన్ని చోట్ల మరింతా హెచ్చింది. హరిద్వారం — ప్రయాగ — కాశీ మున్నగు ప్రదేశాలలోని గంగకు మరింత ఘనత. ఆ ప్రదేశాలు క్షేత్రాలై వెలిశాయి. అట్లే భగవద్గీతకూడ పవిత్రమైన గంగానదిలాంటిది. ప్రతి అధ్యాయమూ ఒక గంగా ఘట్టము. అన్ని ఘట్టాలూ పవిత్రాలే; అయినా కొన్నింటికి మరింతా ప్రాశస్త్యం చేకూరింది. ఆ అధ్యాయాలు

క్షేత్రాలవంటివి. ఈ పంద్రెండో అధ్యాయం ఆ తెగకు చేరినది. ఈ మాటను శ్రీ ఆచార్య వినోభాగారు చెప్పారు. మరేమిటి! శ్రీకృష్ణుడే చెప్పాడు. "యే తు ధర్మ్యామృతమిదం" — ఈ భక్తియోగము అమృతస్వరూపమైన ధర్మమని అధ్యాయాంతంలో శ్రీకృష్ణుడే స్వయంగా సెలవిచ్చాడు. అట్టి పవిత్రమైన అధ్యాయాన్ని చెప్పుకొనే సుయోగం మనకు కల్గినందుకు జన్మాలు ధన్యాలయ్యాయి.

గడిచిన పదకొండో అధ్యాయంలో భగవంతుడు అర్జునునికి విశ్వరూపాన్ని దర్శింపజేశాడు. లోకము లోకేశ్వరుడు వేరువేరు కాదు. ప్రపంచమూ పరమాత్మా భిన్నభిన్నంకాదు. విశ్వమూ విశ్వనాథుడూ విడివిడిగాలేరు. అజ్ఞానదృష్టితో విశ్వమని — లోకమని — ప్రపంచమని దేన్ని భావించామో, జ్ఞానదృష్టి లభిస్తే అదే విశ్వేశ్వరుడై — లోకనాథుడై — పరమాత్మ స్వరూపంతో భాసిల్లింది. హారమని పిలువబడేటప్పుడుకూడా, ఆ హారంలో యేచోటపట్టినా బంగారుతప్ప వేరేవస్తువులేదు; అజ్ఞానికి బంగారుకనబడదు; జ్ఞానికి హారము వుల్లక్కి. "వాచారంభణం వికారో నామధేయం" — కుండలో యేతట్టుచూచినా వుండేది మట్టే. ప్రపంచంలో యెక్కడచూచినా సమస్త నామరూపాలకు అధిష్ఠానంగా భగవంతుడే వున్నాడు. తానుతప్ప తక్కిన సమస్తం భగవంతుని స్వరూపమని భక్తుడు భావిస్తాడు. "మైం సేవక సచరాచర రూపరాశి భగవంత"— అని తులసీదాసు చెప్పాడు. "సచరాచర రూపాలు భగవంతుడు; తాను ఆయనకు దాసుడు" — ఇది భక్తుని భావన. "తనతోసహా సమస్తమూ వాసుదేవ పరబ్రహ్మమే" అని జ్ఞాని భావిస్తాడు. "సకలమిదమహం చ వాసుదేవః" — తానూ సర్వమూ వాసుదేవుడని జ్ఞానియొక్క తీర్మానం. భక్తునికి జ్ఞానికీ ప్రాథమికదశలో కొద్దిపాటి యీ భేదం వుంటుంది. ఆ భేదం చివరిదాకా నిలవదు.

దివ్యనేత్రాన్ని పొంది అర్జునుడు సమస్తమూ భగవత్ స్వరూపంగా దర్శించాడు. అది పదకొండవ అధ్యాయములోని విషయం. ఆ అధ్యాయాన్ని ఉపసంహరిస్తూ భగవంతుడు "జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం" అను శ్లోకముద్వారా ప్రాముఖ్యమైన వుపదేశాన్ని వెల్లడించారు. "జ్ఞాతుం" అనగా తెలిసికొనుట. తానంటే ఏమో — జగ

త్తనగా యేమో – ఈశ్వరుడంటే యేమో, ప్రతివాడూ శ్రవణంచేసి తెలుసుకోవాలి. ఇంతమట్టుకు తెలుసుకొంటే చాలని కొందరంటారు. అది చాలదు. బెంగుళూరులో మాంచి మామిడిపండ్లున్నాయని నాకు తెలుసు. తెలుస్తూనే వచ్చిన లాభమేమి? అందుననే – "జ్ఞాతుం" అన్నవెంటనే "ద్రష్టుం" అనేపదం ప్రయోగింపబడింది. తెలుసుకొన్న దాన్ని దర్శించాలి; సాక్షాత్కరింప చేసుకోవాలి. తర్వాత "తత్త్వేన ప్రవేష్టుం" – అదేస్వరూపము తానై పోవాలి. ఈ సాధననే భక్తి యోగము చెప్పింది.

"మత్కర్మకృన్మత్పరమో – మద్భక్తస్సంగవర్జితః।
నిర్వైరస్సర్వభూతేషు – యస్సమామేతి పాండవ!॥"

ఈ శ్లోకము పదకొండో అధ్యాయానికి ఆఖరులో చెప్పబడింది. దీన్ని గీతార్థసార సంగ్రహమని ఆచార్య వినోబాగారు చెప్పారు. భక్తి యోగాన్ని సాధింప కోరేవానికి కావలసిన అయిదులక్షణాలు యీ శ్లోకంలో చెప్పబడ్డవి. (1) మత్ కర్మకృత్తు, (2) మత్పరముడు, (3) మద్భక్తుడు, (4) సంగవర్జితుడు, (5) స్వభూతేషు నిర్వైరుడు – ఈ అయిదు లక్షణాలలో ఏ ఒక్కటైనా వుంటేనే భగవంతున్ని పొంద గల్గేది. ఈ శ్లోకంలో 'మత్' అనేపదం మూడుమార్లు ప్రయోగింప బడింది. ఆ ప్రయోగంలో ఉత్తమమగు స్వారస్యం యిమిడింది. దాన్ని మనం లక్ష్యంలోనికి తెచ్చుకోవాలి.

'మత్ కర్మకృత్' – పనులన్నీ భగవంతుని పనులు కావాలి. మనము కొన్నిపనులు మనవిగానూ, కొన్నిపనులు భగవంతునివిగాను పంపిణీచేసుకొన్నాము. జపము తపము పూజ ధ్యానము – ఇవి భగవం తుని పనులు. పనిపాట – వ్యాపారం వ్యవహారం – ఇవి మనపనులు. ఈ భేదం పనికిరాదు. అన్నీ భగవంతుని పనులేకావాలి. నీ పనులుకొన్నిగా– నాపనులు కొన్నిగా ప్రత్యేకం వుండరాదని భగవంతునిబోధ. నీవూ నేనూ అనే భేదమే సమసిపోవాలి. భక్తునికి భగవంతునికి మధ్యా వెంట్రుకవాసి వ్యవధానంకూడా సహింపరానిది. చేసేదంతా ఈశ్వరీయకర్మ. మనకర్మగా వుండరాదు. కొన్నిపనులు చేసేటపుడు భక్తుడు; కొన్నిపనులు చేసే టప్పుడు అభక్తుడు – ఈతంతు పనికిరాదు. భక్తి అనేది బురఖాకాదు.

పోలీసు ఉద్యోగి ఆఫీసుకు పోయేటపుడు దుస్తులు ధరిస్తాడు. ఇంటికి వస్తూనే ఆ డ్రస్సువిడిచి గూటానికి (చిలుకుకు) తగిలిస్తాడు. మనమూ కూడా దేవాలయాలకు, ఆశ్రమాలకు, సభలకు, సమావేశాలకు పోయే టపుడు భక్తిడ్రెస్సు ధరిస్తాము. ఇంటికివస్తూనే దాన్ని వంకెకు తగి లిస్తాము. భక్తులమనే పేరు పెట్టుకొన్నాంకానీ — అందుకు తగినట్లు మన మనస్సు లేదు. మాటమాత్రానికి కృష్ణార్పణం అనుటేకాని, మనం చేసేదంతా దేహార్పణం — కళత్రార్పణం — పుత్రార్పణం. ఇదొక్క నాటకం.

దేహము పరమాత్మునిది; లోకము పరమేశ్వరునిది. మనమను కొన్నా అనుకోకున్నా నిజమేమో అంతే. ఈ దేహము నీదే అయితే దీన్ని నీవు తయారుచేసుకొంటావా? ఒక అవయవం చెడిపోతే దాన్ని రిపేరి చేసి చక్కబెట్టుకొంటావా? అదిలేదే! మరి నాది నాదని మిడిసిపడడంలో అర్థమేమి? సినిమాలో పరదాలాగా పరమాత్మ స్థిరంగావున్నాడు. దానిపై అన్నిబొమ్మలు అగపడును. పరమాత్మయందే సమస్తమూ గోచరిస్తూం టుంది. అందరూ బొమ్మలను చూచేవారే కాని పరదా (తెర)ను చూచే వారుకారు. పరదాలేనిచో ఆటేలేదు. కర్తృ కర్మ క్రియలన్నీ పరమా త్ముని ఆశ్రయించి జరిగిపోతున్నాయి. కాని వానిని లక్ష్యములో వుంచు కొని వ్యవహరించేవారు తక్కువ. కాబట్టే 'మత్కర్మకృత్' అని భగ వంతుడు హెచ్చరించారు.

'మత్ కర్మకృత్' భగవంతునికొరకు పనులుచేసేవాడు. ఈ విష యాన్ని అనుభవంలోనికి తెచ్చుకోవాలంటే, ''మత్పరమః'' — భగవత్ప రముడు కావలెను. 'మత్పరముడు' అనే యోగ్యతాపత్రాన్ని సంపాదిం చాలి. భగవంతుడుతప్ప వేరేవస్తువేలేదని గ్రహించాలి. ప్రపంచములోని వస్తువులకు పరమస్థానము — ప్రధానస్థానము యిచ్చేవాడు కాకుండా, పరమాత్మునికి పరమస్థానము — ప్రధానస్థానము యిచ్చేవాడు కావాలి. మనము అలా చేయడంలేదు.

'మద్భక్తః' — భగవద్భక్తుడు కావాలి. మనము ప్రపంచానికి భక్తులము; విషయసుఖాలకు భక్తులము. కొందరికి ధనంపై భక్తి; కొందరికి భూములపై భక్తి; కొందరికి పెండ్లాముపై భక్తి; కొందరికి బిడ్డలపై భక్తి;

కొందరికి కీర్తిప్రతిష్ఠలపై భక్తి. మరి భగవంతునిపై భక్తి ఏ నూటికో కోటికో! ఒకవేళ మనం భక్తిచేసినా, దినానికి ఒక గంట భగవంతునికి భక్తులము. 23 గంటలు ప్రపంచానికి భక్తులము. పేరుకు శివపూజ — చేసేదంతా శవపూజే.

భగవాన్ కృష్ణుడు చెబుతూన్నాడు. 'నాయనా! నాభక్తుడివికా!' మరి భక్తుడంటే ఎవరు? ముమ్మారు స్నానంచేస్తేనా? విభూతో, పంగ నామాలో పెడితేనా? పూటపూట దేవాలయం వెళ్ళితేనా? తీర్థక్షేత్రాలు తిరిగితేనా? — కాదు. ఇది భక్తికాదు. ఇవి సత్కర్మలు మాత్రం. వేష భూషణాలతో భక్తుడుకాలేడు. భగవంతునితో విభక్తము కానివాడే భక్తుడు. విభక్తిలేనిదే భక్తి.

"సంగవర్జితః" — మరీ సంగదోషరహితుడు కావాలి. నిజానికి ఆత్మ అసంగము. "అసంగోఽహ్యాయం పురుషః". వ్యాపకవస్తువునకు సంగమెక్కడిది? ఆకాశమువలె పరమాత్ముడు వ్యాపకుడు. కావుననే భక్తిశాస్త్రాలు భగవంతుని వర్ణిస్తూ ఆతని ప్రతి అవయవాన్ని కమలంతో సాదృశ్యం చెప్పాయి. పాదకమలము—హస్తకమలము — నాభికమలము— హృదయకమలము — నేత్రకమలము — ముఖకమలము, అని ప్రతి అంగాంగములకు కమలము ఉపమానం చెప్పబడింది. కమలము ఆర్య సంస్కృతికి ఆదిప్రతీకము. కమలము బ్రహ్మకంటే ముందే పుట్టిందని పురాణాలు చెబుతవి. అసంగత్వము—రమణీయత్వము కమలములోని విశిష్టలక్షణాలు. నీటిలో బురదలో వుండీ వుండనిది; అంటీ అంటనిది. కమలమువలె పురుషోత్తముడు అసంగుడు. బ్రహ్మాండమంతా వ్యాపించి కూడా ఆయన అంటుకోడు. అట్లే నీ ఆత్మకూడ అసంగము. ఏ దేహంలో వున్నా ఆ దేహసంబంధమగు ఉచ్చనీచ గుణదోషాలు దాన్ని అంటుకో లేవు. ఆత్మయొక్క అసంగభావాన్ని గుర్తించినపుడే నిజమైన సంగవర్జితుడు కాగల్గుట.

తర్వాత, "నిర్వైర స్సర్వభూతేషు" — సమస్త భూతములందు వైరబుద్ధిలేనివాడై వుండాలి. ఎందుకు? సమస్తమూ పరమాత్ముని స్వరూపము. సర్వమూ తానే. తనకంటె వేరేవస్తువు లేనపుడు వైరానికి చోటెక్కడ? ఈ అభేదదర్శనమే జ్ఞానము.

శ్రీ రామతీర్థస్వాములవారు సంన్యాసాన్ని స్వీకరించిన తర్వాత హిమాలయాలల్లో ఒంటరిగా నివసిస్తూవచ్చారు. ఒకప్పుడు ఆయన సతీమణి శ్రీవారి సందర్శనానికి వెళ్లింది. ఆయన్ను దర్శించింది. "స్వామీ! నన్నెపుడైనా తలచుకొంటూంటారా?" అని అడిగింది. "ప్చ్, లే" దని ఆయన జవాబిచ్చాడు. "అయ్యో! ఇన్నాళ్లు మీకు సేవచేసిన నన్ను మరచిపోయారా" అని ఆమె వ్యాకులపడింది. ఆయన అన్నాడు. "సాధ్వీ! మరచిందీలేదు; తలచిందీలేదు. నాకంటె నీవు వేరుగా వుంటే గదా, నిన్ను తలంచడం – మరచడం. అనన్యం కాబట్టి మరిచేదిలేదు; ఆత్మస్వరూపం కాబట్టి తలచేదిలేదు. నీ విప్పుడడిగినట్లు నాచెవి నన్నొకనాడు అడిగిందనుకో! "స్వామీ! నేను మీకెంతో వుపకరిస్తాను. నన్ను మీరు స్మరిస్తూంటారా?" – అని అడుగుతుంది. నేనేమని చెప్పాలి. నాకంటె అది వేరై వుంటేనా? స్మరించడం – విస్మరించడం.

"అభేదదర్శనం జ్ఞానం." ఈ జ్ఞానము సిద్ధించినపుడే, "నిర్వైర స్సర్వభూతేషు" అనేమాట అక్షరాలా సార్థకమైతుంది. ఈ అయిదింటిలో 'మత్కర్మకృత్' అనేది కర్మయోగాన్ని సూచిస్తుంది. "మత్పరమః – మద్భక్తః" అనేవి భక్తియోగానికి సంకేతాలు. "సంగవర్జితః – నిర్వైర స్సర్వభూతేషు" – అని జ్ఞానయోగానికి సూచనలు. కర్మభక్తి జ్ఞానాలు పరస్పర పోషకములై పురికొన్నాయి. "జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం" – అను వాక్యంలో, మొదట తెలుసుకోడం – తర్వాత దాని సాక్షాత్కారాన్ని పొందడం – ఆపై తాను ఆ స్వరూపమే అయిపోవడం, యిట్లు మూడింటి సమ్మేళనం చెప్పబడింది.

భగవద్గీత సమన్వయ శాస్త్రం. ఇదొక్క యోగరసాయనము. కర్మగొప్పదని కొందరు – భక్తి గొప్పదని కొందరు – ధ్యానము గొప్పదని కొందరు – జ్ఞానము గొప్పదని కొందరు, పిడివాదాలు చేస్తూంటే, ఆ పాక్షిక భావాలకు యెడమీకుండా భగవద్గీత అన్ని యోగాలకు తగిన స్థానమిచ్చి ఆదరించింది. సామాన్యంగా లౌకిక కార్యాలల్లోకూడా యీ నాల్గు యోగాలు కలిసేవుండాలి. ఇక పరమపురుషార్థమైన మోక్షానికి వీటి సమష్టి సహకారము అక్కరలేదా? వుంది. అనివార్యంగా వుంది.

మచ్చుకు ఒక వంట విషయాన్ని చెబుతాను. వంట అనేది ఒక సామాన్యమైన పని. ఆ పనిలోకూడా యీనాల్గూ కలిసిరావాలి. ఏఒక్కటి తక్కువైన పనికాదు. ఉప్పు పప్పు - బియ్యం బేడ - కట్టె కంప తెచ్చి పొయ్యి రగుల్కొల్పి ఆయత్తపడడం కర్మయోగమనొచ్చు. బియ్యానికి తగినట్లు నీళ్లు - పప్పుకు తగినట్లు ఉప్పు - వంటకు తగిన మంట, ఈ పరిజ్ఞానం కావొద్దా? దీన్నే జ్ఞానయోగమందాం. పాత్రను పొయ్యిపై పడేసి వీధిలో కబుర్లు చెప్పుకొంటూంటే వంట భ్రష్టై పోతుంది. దానిపై నిగా వుంచాలి. దాన్నే ధ్యానయోగమని చెప్పుకొందాం. చిమ్ముకొంటూ చీదుకొంటూ చేసినవంట తిన్నవారికి వొంటపట్టదు. ప్రీతితో - భక్తితో తాను చేసినవంటను ఆరగించి యింటిల్లపాది ఆనందించాలని, తృప్తి చెందాలని, వంటచేసే ఆడవారు తలంచాలి. దాన్నే భక్తియోగమనుకొందాం.

ఈ నాల్గు యోగాలు వంటచేసేవాళ్లకే అవసరమైనవుడు, పరమార్థ సాధకునికి వీటితో పనిలేకపోతుందా? జీవితంలో సర్వాంగీణ వికాసాన్ని సాధించాలంటే ఈనాల్గూ జతకూడి నడవాలి. కాబట్టే శాస్త్రరాజమైన భగవద్గీత వీటి సమన్వయాన్ని ప్రతిపాదించింది.

భక్తి గంగవంటిది. కర్మ యమునలాంటిది. జ్ఞానము సరస్వతి. భక్తి కర్మలు బైటికి గోచరిస్తాయి. జ్ఞానము గుప్తగామిని. అది బయటికి కనబడేదికాదు. భక్తుడు గంగానదివలె పరిశుద్ధుడు - పవిత్రుడు అయి వుండాలి. ఈ సందర్భంలో పరమభాగవతుడైన శ్రీ ఏకనాథస్వామివారి ఒక వుదంతం జ్ఞప్తికి వస్తూంది వినండి.

శ్రీ ఏకనాథస్వామివారు ఒకప్పుడు కొంతమంది మిత్రులతోకలిసి కాశీయాత్ర వెళ్ళినారు. ఈ నాటి ప్రయాణసౌకర్యాలు ఆనాడు లేవు కాబట్టి, వారు కాలినడకతోనే యాత్రచేశారు. తీర్థరాజమగు ప్రయాగలోని గంగాజలాన్ని కావడి కుండలకెత్తి తిరుగుప్రయాణం రామేశ్వరానికి బయల్దేరారు. గంగాజలంతో రామలింగేశ్వరుని అభిషేకించి తమ పూర్ణయాత్రను సార్థకం చేసుకొనుట పూర్వీకుల ఆచారం. ఆ మర్యాదననుసరించి ఏకనాథస్వామివారు తన మిత్రబృందంతో దక్షిణాభిముఖులై

వస్తూన్నారు. గంగ కావడిని నేలపై పెట్టరాదు కాబట్టి వంతులవారీగా-భుజాలు మార్చుకొంటూ తెస్తూన్నారు. మార్గమధ్యంలో వారు మార్వాడీ దేశంగుండా రావలసివచ్చింది. అసలే మార్వాడీ దేశంలో నీటికి మహాయెద్దడి. అందులోను వీరు ఒక యెడారిమధ్యా రావలసివచ్చింది. ఒకచోట ఒక గాడిదె నేలపైబడి విలవిల తన్నుకొంటూంది. దానికి చావుకూ చాలాదురంలేదు. ఆ దురవస్థను చూచి శ్రీస్వామివారు పరువు పరువున వచ్చి దాన్ని అమాంతం పరిశీలించారు. వడగొని విపరీతమైన దప్పితో అది చస్తూందని వారు గమనించారు. తటపటాయించకుండా కడవలోని గంగాజలాన్ని దాని గొంతులో కావలసినన్ని పోసి దాని దప్పి తీర్చాడు. మిగిలిన నీటితో సర్వాంగస్నానం చేయించి దాని తాపం తీర్చాడు. ప్రాణదాతకు చూపులతో మ్రొక్కులు చెల్లించి గార్దభం తనదారి తాను పట్టింది. ఇంతదూరం మోసితెచ్చిన తీర్థాన్ని రామేశ్వరానికి చేర్చకపోతినే అనే విచారం వారికిలేదు. సరిగదా! సజీవంగావుండే రామలింగేశ్వరునికి అభిషేకంచేసి తన శ్రమను సార్థకం చేసుకొన్నానని ఆయన మురిసిపోయాడు. చూచారా! భక్తుని వ్యక్తిత్వం యెంతగా వికసించిందో!!

ఈ అధ్యాయంలోని మొదటిశ్లోకము, "విశ్వరూపోపాసకుడు గొప్పా? అక్షరోపాసకుడు గొప్పా?" అని అడిగిన అర్జునుని ప్రశ్న. తర్వాత పదకొండు శ్లోకాలు సాధనవిషయాన్ని గురించి శ్రీకృష్ణుడు చెప్పిన వుపదేశము. తదుపరి ఏడుశ్లోకాలలో సాధ్యవిషయము నిరూపించబడింది. చివరిశ్లోకము ఫలశ్రుతి. ఇట్లు మొత్తం యిరవైశ్లోకాలతో యీ భక్తియోగం ముగుస్తుంది.

భక్తులు సగుణభక్తులని నిర్గుణభక్తులని రెండువిధాలు. ఆర్తుడు - జిజ్ఞాసువు - అర్థార్థి, వీరు భగవంతుని సగుణస్వరూపాన్ని భజించేవారు. జ్ఞాని నిర్గుణభక్తుడు. శ్రీకృష్ణుడు అందందు సందర్భానుకూలంగా సగుణ భక్తులనూ నిర్గుణభక్తులనూ ప్రశంసిస్తూవచ్చాడు. ఆ యిద్దరి యెక్కువ తక్కువలను తెలియగోరినవాడై అర్జునుడు ప్రశ్నిస్తూన్నాడు. ఇది యీ అధ్యాయానికి మొదటిశ్లోకం.

"భగవంతా! పదకొండో అధ్యాయంలో చెప్పినట్లు విశ్వరూపోపాసన చేసేవారు సగుణభక్తులు. అక్షరమూ అవ్యక్తమూనైన ఆత్మ తత్త్వాన్ని అనుసంధిస్తూ అహంగ్రహోపాసన చేసేవారు నిర్గుణభక్తులు. ఈ యిద్దరిలో శ్రేష్ఠులెవరని నీ అభిప్రాయం" – అని అర్జునుని ప్రశ్న.

ఈ శ్లోకంలోని తాత్పర్యాన్ని బయటికి లాగేకోసం వ్యాఖ్యాన కర్తలు ఎంతెంతో హంగామాపడ్డారు; రకరకాల అభిప్రాయాలను వెలిబుచ్చారు. సగుణభక్తులు తక్కువని కొందరూ, నిర్గుణభక్తులు తక్కువని కొందరూ, అసలు శ్రీకృష్ణుని తీర్మానంతో పనిలేకుండానే తామే సిసలుగ తీర్మానించారు. కృష్ణునికిలేని తగాదా వీరికెందుకొచ్చిందో! సగుణం – నిర్గుణం అనేభేదం సాధకదృష్టిలోనేకానీ, యీ రెంటికీ అతీతమైన సిద్ధస్థితిలో లేదు. ఈ రెండూ సాపేక్షిక శబ్దాలు. శ్రీకృష్ణుడు యీ పేచీలో ప్రవేలుపెట్టలేదు. అర్జునుడడిగిన ప్రశ్నకు సూటిగా జవాబు చెప్పకుండా భగవంతుడు పద్ధతిమార్చి చెబుతూన్నాడు. శ్రీకృష్ణుడుచెప్పిన సమాధానము స్పష్టమయ్యేకోసం ముందుగా ఒక ఉదాహరణాన్ని చెబుతాను.

ఒక స్త్రీకి యిద్దరు కొడుకులున్నారు. పెద్దవాడు యెదిగినవాడు. మైనరు తీరాడు. స్వతంత్రంగా తిరుగగలిగేవాడు. రెండవవాడు మైనరు బిడ్డ. తల్లిచాటున వుండవలసినవాడు. ఈ యిద్దరిలో నీకెవడు శ్రేష్ఠుడని తల్లిని అడిగితే ఆమె యేమని చెప్పాలి? ఒకప్పుడు ఆ దేశానికి యుద్ధము వచ్చింది. సర్కారువారు యింటికొక్కనిచొప్పున నిర్బంధంగా ప్రజలను సేనలోకి తీసుకొంటున్నారు. ఆమెయింటికికూడా వంతువచ్చింది. "అమ్మా! నీ యిద్దరి కొడుకులలో ఒకణ్ణి మాకు యివ్వాలి" – అని అడిగితే తల్లి ఏమిచేస్తుంది? తప్పనిసరి యివ్వవలసేవస్తే పెద్దవాన్ని యిస్తుంది. ఎందుకంటే, వాడు సమర్థుడు – స్వతంత్రుడు. కాని చిన్నవాని బాగోగులు – యోగక్షేమాలు తనపై ఆధారపడి వున్నాయి. కాబట్టి వాన్ని వదిలేటందుకు యిష్టపడదు. అంతమాత్రంతో తల్లికి చిన్నకొడుకు శ్రేష్ఠుడని, పెద్దకొడుకు అశ్రేష్ఠుడని భావించరాదు.

భగవంతునికి భక్తుడూ జ్ఞానీ యిద్దరూ బిడ్డలే. ఎవరుగొప్ప అని అడిగితే యేమని చెప్పాలి? పైనిచెప్పిన యిద్దరుబిడ్డల తల్లివలెనే

కృష్ణుడూ ప్రవ ర్తించాడు. సగుణభ క్తులు భగవంతుని ఆదరువులో వుండవలసినవారు. స్వశ క్తి వారికి లేదు. వారిని సంసారసముద్రంనుండి ఉద్ధరించే బాధ్యత భగవంతునిది. నిర్గుణభ క్తుల విషయమలాకాదు. వారు సర్వతంత్ర స్వతంత్రులు. సర్వైకసమర్థులు. ఎక్కువని తక్కువని వారిని తూచే సాధనాలు లేవు. వారు అతీతులు. నిర్గుణభ క్తులను ప్రౌఢుల స్థానంలోనూ, సగుణభ క్తులను బాలురస్థానంలోను నిలిపి భగ వంతుడు సమాధానమిస్తూన్నాడు.

సగుణభ క్తులనగా, విశ్వమును విశ్వేశ్వరునిగ తలంచి సేవచేసే వారు. గడచిన పదకొండో అధ్యాయంలో 'విశ్వమే విశ్వేశ్వరుడు — ప్రపంచమే పరమాత్మ' అని ప్రతిపాదింపబడింది. ఈ పన్రెండో అధ్యా యంలో పేర్కొనిన సగుణభ క్తియొక్క స్వరూపము అదే. దప్పిగొన్న వానికి ఒకగ్లాసు మంచినీరు యిచ్చావంటే — ఆ నీరు పరమాత్మునికి చెందిందనే భావించాలి. అది కేవలం భావనేకాదు. నిజంకూడా అంతే. అన్ని దేహాలలో వుండి ఆరగించేవాడు వై శ్వానర పరమాత్మడే కదా! ఇదే విశ్వేశ్వర పూజ.

నిర్గుణభ క్తుల దృష్టిలో ప్రపంచము మిథ్యామాత్రం. ఇది నామ రూప విడంబనం. వస్త్రదృష్టి మిథ్య. సూత్రదృష్టి సత్యం. దారాలను ప్రక్కకుతీ స్తే వస్త్రమంటూ ఒకటీలేదు. పరమేశ్వరుడే సత్యము. ఆయన అక్షరుడు. అనగా క్షయనాశాలు లేనివాడు; తరుగు పెరుగులు లేనివాడు. ఆతడు అవ్య క్తుడు. ప్రత్యక్షాది ప్రమాణాలకు వ్య క్తమయ్యే వాడుకాడు; మనోవాక్కులకు తెలియబడేవాడు కాడు. అట్టి తత్వాన్ని వుపాసించేవారు సోఒహంభావపరులు, నిర్గుణోపాసకులు, వారిదృష్టిలో విశ్వమొకటి — విశ్వేశ్వరుడొకటి రెండువస్తువులు లేవు.

ఒకవిధంగా మొదటి ఉపాసనను సాధనంగాను, రెండోదాన్ని సాధ్యంగాను పరిగణించొచ్చు.

— ప్రథమ విశ్రాంతి —

మకాం - బంగారుపేట.

ప్రియమైన ఆత్మబంధువులారా!

సర్వాంతర్యామియైన శ్రీకృష్ణభగవంతుని అనుగ్రహంవల్ల శ్రద్ధా భక్తి విశ్వాస సహానుభూతులతో మన కార్యక్రమము నెరవేరిపోతూంది. సర్వేశ్వరుడు ముున్ముందుకూడా యిలాగానే మనకు ఉత్సాహ ప్రోత్సాహాలను దయచేయాలంటూ వేడుకొంటాను.

ఉపన్యాసకుడు మాలాకారునివంటివాడు. పుష్పమాలలను కట్టే వాడు ఓపికతో చెట్టు చెట్టు పూలను సేకరించుకోవాలి, దండగట్టే టపుడు ఏ పుష్పాన్ని యెచ్చట పెట్టాలో యెరిగి పెట్టాలి. అప్పుడే పూల దండ శోభాయమానంగా వుండేది. అట్లే వుపన్యాసకుడుకూడా అనేక శాస్త్రాలనుండి అనేక విషయాలను సేకరించి సందర్భోచితంగా వాటిని పొదిగి ఆహ్లాదకరమైన తన వుపన్యాసమాలతో శ్రోతలను అలంకరించాలి.

గీత మనపాలిటి తల్లి. "అంబ" అని మనం ప్రార్థనాశ్లోకాలల్లో చెప్తూనే వున్నాము. ఆమెది మాతృహృదయం. సరిగ్గా వుచ్చరించేవరకూ విడిచిపెట్టకుండా తల్లి పిల్లవానికి పాఠం బోధిస్తుంది. అలాగే గీతామాత మనకు ఆధ్యాత్మిక పాఠాన్ని సరళసుబోధకంగా ఉపదేశిస్తుంది. ఆమెకు విసుగులేదు. మనకు అరోచకముండరాదు. ధార్మిక విచారాలల్లో — భక్తి ప్రసంగాలల్లో — జ్ఞాన గోష్ఠులలో విసుగు — అరోచకముండరాదు. యాభై యేండ్లనుండి కాఫీని ప్రతిపూటా త్రాగుతూన్నాము. దానిపై అసహ్యం పుట్టలేదు. ఏపూటకాపూట రుచిగానేవుంది. కాని వేదాంత మంటే — ఏమిఖర్మమో — తలనొస్తుంది; నిద్రవస్తుంది. క్షుద్ర విష యాలను మరిగి తదాకారాకారితమైన మనస్సుకు ఆధ్యాత్మిక విషయాలు బొత్తుగా హత్తుకోవు. దినమూ తిండి తింటాము. దినమూ నిద్ర పోతాము. దినమూ చేసిందే చేస్తాము. కాని అవి పాతకాలేదు; రోత కాలేదు. వేదాంతమంటేనే పాతా — రోతా.

"గేయం గీతా" — అని శ్రీ శంకరాచార్యులవారి సలహా. గీతను పాడాలి; పఠించాలి అని దాని అర్థం. గీతాశాస్త్రాన్ని సర్వో సర్వత్ర చదవాలి; చదివించాలి. గీతాతత్త్వాన్ని వినాలి; వినిపించాలి.

పరిశుద్ధంగా వుచ్చరించలేకపోయినాసరే — భయపడపనిలేదు. చక్కగా పలుకలేమని అసలు చదివేదే మానుకోరాదు. భగవంతుడు భావాన్నే స్వీకరిస్తాడు. భాషపై ఆయనకు పట్టింపులేదు. అయినా వీలైనంతకు సుశబ్దంగా చదివేది నేర్చుకోవాలి. తప్పి జారి అపశబ్దాలు చదివినా ఫరవాలేదన్నామేకానీ, అపశబ్దాలతోనే చదువమని చెప్పుటలేదు.

గీతాపారాయణమొక యోగమై యుండాలి. ఇంద్రియాలన్నీ యేకముఖంగా ఆ యోగంలో లీనమైపోవాలి. మోటారు నడిపేవాని కాళ్లు చేతులు కన్నులు ఒకేపనిలో లీనమై వుంటాయి. అట్లే, పవిత్రమైన గీతాశ్లోకాలను చూస్తూచూస్తూ మన చూపులు పవిత్రాలైపోవాలి. ప్రపంచంలోని మంచి చెడ్డ నానాకవస్తువులను చూచిచూచి అపవిత్రాలైన కళ్లు పవిత్రంకావాలి. శ్లోకాలు కంఠస్థంగా వచ్చినాకూడా పారాయణ చేసేవాని దృష్టి పుస్తకంతట్టే వుండాలి కాని దిక్కులు దిక్కులు చూస్తూండరాదు. సంసారంలో అంటరాని - ముట్టరాని నానావిషయాల సంపర్కంతో మన హస్తాలు దూషితాలైపోయాయి. గీతాగ్రంథాన్ని స్పృశించి స్పృశించి అవి ధన్యం కావాలి. లోకవార్తలను మరిగి నానా దుర్భాషలాడియాడి పాపపంకిలమైపోయిన యెంగిలి నాలుక గీతా శ్లోకాలను పలికి పలికి పవిత్రం కావాలి. కనపడిన పెంటకుప్పలన్నిటిలో పొర్లాడి దొర్లాడి భ్రష్టుపట్టిన పాడుమనస్సు గీతాపారాయణస్నానం చేసి నిర్మలం కావాలి. వెయ్యేల! గీతాపారాయణతో మాంసమయ శరీరం మంత్రమయంకావాలి. మర్యాదస్థుని కూర్చోపెట్టాలంటే ప్రదేశాన్ని శుభ్రంచేయాలిగదా! గీతామాతను గీతాచార్యుని మీ హృదయ ప్రదేశాల్లో ప్రతిష్ఠించాలంటే ఆ చోటి పెంటకుప్పలను ముందుగా తొలిగించు. ఒక్క గీతాపారాయణాన్ని శ్రద్ధతో చేశావంటే యిన్ని ఫలితాలు లభిస్తాయి.

గీతాపఠనంతో పాపం పోతుంది. గీతాతత్త్వజ్ఞానంతో అజ్ఞానం తొలుగుతుంది. జ్ఞానాన్ని మించిన పవిత్రవస్తువులేదు; అజ్ఞానాన్ని మించిన అపవిత్రవస్తువులేదని గీతయొక్క తీర్మానం. భారతదేశాన్ని నల్గడల ఆవరించిన అజ్ఞానాంధకారము పటాపంచలు కావాలంటే ఉదార ధార్మిక

భావాలకు నిలయంగావుండే గీతాశాస్త్ర ప్రచారం, స్త్రీలు పురుషులు చిన్నలు పెద్దలను వివక్షతలేకుండా మనదేశంలో విరివిగా సాగిపోవాలి.

అజ్ఞానం స్త్రీ సమాజంలో మరింతా కరుడుగట్టింది. పవిత్రమైన మాతృస్థానాన్ని మనం అధోగతి పాలుచేశాము. "నాస్తి మాతృసమో గురుః" — తల్లికి దీటైన గురువులేడని ఆర్యశాస్త్రాల ఉద్ఘోష. తల్లి మొదటి గురువు. ప్రాథమిక విద్యాభ్యాసాన్ని తల్లి ఒడిలోనే చేయాలి. అట్టి తల్లులు జ్ఞానానికి విద్యకు దూరమైపోయారు. ఈనాటి స్త్రీలు చక్కని భార్యలు కాగల్గుచున్నారు కాని, చక్కని తల్లులు కాడంలేదు. ప్రథమ గురుస్థానమే పతితమైపోయింది. పురుషులు తమ స్త్రీలకు రెండే వుద్యోగాలను ఖాయంచేశారు. వంటచేసేది ఒకటి. బిడ్డల గనేది రెండు. అంత కెక్కువ పోనిస్తే తమ నిరంకుశ ప్రభుత్వానికి యెక్కడ వ్రూనం వస్తుందో నని వారికి మహద్భయం. ప్రతివాడూ తనభార్య అచ్చం సీతాదేవి లాగ వుండాలని అభిలషిస్తాడు. మంచి దే. తాను శ్రీరామునివలె వుండాలనే బుద్ధి యెందుకుండరాదు? తాను రావణునివలె వున్నాసరే — భార్యమాత్రం సీతై వుండాలి. ఈ న్యాయం ఏలోకంలో వుంది. తాను రాముడై వుంటే అంతేచాలు; ఆమె చెప్పకనే సీతై వుంటుంది. స్త్రీలోకం పతితమైందంటే, ఆ తప్పుకు - ఆముప్పుకు పురుషులు ముప్పాతిక జవాబ్దారీ వహించాలి. శరీరంలో యెడమభాగానికి పక్షవాతం క్రమ్మిందంటే కుడి భాగం హాయిగా వుండ వీలౌతుందా? స్త్రీసమాజంలో సీతలు సావిత్రులు మదాలసలు ఆవిర్భవించినప్పుడే మనంకోరే రామరాజ్యం మనకు వెలసేది. "శుద్ధోఽసి బుద్ధోఽసి నిరంజనోఽసి। సంసార మాయా పరివర్జితోఽసి। సంసార స్వప్నం త్యజ మోహనిద్రాం। మదాలసా వాక్య మువాచ పుత్రం॥" — అన్నట్లు, ఆత్మజ్ఞానాన్ని నూరి — ఉగ్గుబాలతో కలిపి — వెన్నతో పిసికి బిడ్డలకు త్రాపించే తల్లులు కావాలి. గృహ సామ్రాజ్య లక్ష్ములు — మోక్షసామ్రాజ్యలక్ష్ములు కావాలి. ఆ సువర్ణ భాగ్యం గీతామాతయొక్క వరప్రసాదంతోనే మనకు లభించాలి.

భగవద్గీతలోని పండ్రెండో అధ్యాయం - పేరు భక్తి యోగం — అదే మన ప్రస్తుత ప్రసంగవిషయం.

భక్తి అంటే ప్రేమ అని అర్థం. "సా పరానురక్తిరీశ్వరే" — అని భక్తి సూత్రకర్తలైన నారద శాండిల్యులు చెప్పారు. భగవంతునిపై గల నిరతిశయమైన అనురాగమే భక్తి. భక్తి డబ్బిచ్చికొనేవస్తువుకాదు. పైన తగిలించుకొనే బురఖా కాదు. ప్రేమవృత్తిప్రవాహము చెల్లాచెదురుగాక, యేకోన్ముఖముగా యీశ్వరుని తట్టు ప్రవహించిందంటే దానినే భక్తి అంటారు.

కర్మ యెద్దుబండివంటిదని - జ్ఞానము విమానము వంటిదని — భక్తి రైలుబండి వంటిదని యీవరకే చెప్పాము. భక్తిమార్గము సులువైన మార్గమని పెద్దలు చెబుతారు. కారణమేమంటారా? వినండి. భక్తి అనగా ప్రేమ అని చెప్పాముగదా! ప్రేమలేని జీవి ప్రపంచములో ఒక్కటీ లేదు. పులిలోకూడా ప్రేమ వుంది. దాని బిడ్డలపై అది ప్రేమ చూపుతుంది. ప్రేమ అంతటా వ్యాపకమై సహజంగావుంది. దానికొరకు యే లోకానికీ పోవలసిన పనిలేదు. ఆర్డరిచ్చి కంపెనీనుండి తెప్పించే వస్తువు కాదు. కానైతే, మన ప్రేమ అశాశ్వతవస్తువులలో వ్యభిచరిస్తూ దుర్వినియోగమై పోతూంది. ఆలుబిడ్డలపై - ధనధాన్యాలపై - వస్త్రవాహనాలపై - గృహారామక్షేత్రవిత్తాలపై, మన ప్రేమ లంకించుకొంది. ప్రేమ వృత్తి భార్యపై ప్రసరించునపుడు మోహమంటారు. బిడ్డలపై జారినపుడు వాత్సల్యమంటారు. సమానులపట్ల చూపేప్రేమను మైత్రి అని, దీనులయెడ కల్గిన ప్రేమను కరుణ అని వ్యవహరిస్తారు. అదే ప్రేమ — భగవంతునిపై, గురువుపై ప్రవహిస్తే భక్తి అని పిలువబడ్తుంది. మన ప్రేమప్రవాహము కనబడిన ప్రతి వస్తువుపై జారిజారి చిందరవందరగ చెల్లాచెదురుగ నానాచీలికలుగ యేర్పడి దుర్బలమై క్షీణమై హీనమై యెందుకూ కొఱగాకుండా పోతూంది. నానాముఖాలై ఛిన్నాభిన్నమైన ప్రేమ ప్రవాహాన్ని అరికట్టి ఏకముఖంచేసి భగవంతునితట్టు దాన్ని ప్రసరింప జేయాలి. హాస్పేటవద్ద తుంగభద్రానదికి ప్రాజెక్టు కట్టారు. ఇంతవరకూ తుంగభద్రనీరు సముద్రంలోపడి వ్యర్థమైపోతూండింది. గవర్నమెంటువారు ఆ నదీప్రవాహానికి అడ్డంగా ఆనకట్టకట్టి ప్రక్కను కాలువలు త్రవ్వించి ఆ నీటిని పొలాలవైపు మళ్లించి దేశాన్ని సస్యశ్యామలం

చేస్తూన్నారు. అట్లే మన ప్రేమప్రవాహం సంసార సముద్రంలోపడి నిరర్థకమైపోతూంది. ఆ ప్రవాహానికి వైరాగ్యమనే ఆనకట్టకట్టి అభ్యాస మనే కాలువలగుండా భగవంతునివైపునకు మళ్లించాలి. అపుడే మానవ జన్మానికి సార్థక్యం.

"సా పరానురక్తి రీశ్వరే" — ఈశ్వరునిపైగల పరమానురాగమే భక్తి. గోపికలు శ్రీకృష్ణ సంకీర్తనం నిరంతరం చేసేవారు. కృష్ణా! కృష్ణా! అని ఉన్మత్తగానం చేసేవారు. నారదు డొకనాడు వారిని చూచాడు. "వీరు కేవలం మూఢభక్తిలోవున్నారు. కృష్ణతత్త్వజ్ఞానం వీరికి బొత్తిగా తెలియదు. తత్త్వబోధచేసి వీరిని జ్ఞానులుగ చేస్తా"నని తలంచి నారదుడు కృష్ణునివద్దకెళ్ళి తన అభిప్రాయాన్ని తెల్పాడు. గోపభామినులకు తత్త్వోప దేశం చేసేటందుకు అనుమతి యిమ్మన్నాడు. జగన్నాటక సూత్రధారి "సరే పో"మ్మని తలపంకించాడు. నారదమహర్షి ఆదరబాదర గోపికల కడకొచ్చి "ఓ కామినులారా! మీకు తత్త్వబోధచేసేకోసం వచ్చాను. తీరిక చేసుకొని వచ్చి నా ఉపదేశాన్ని ఆలకించి మీరు ధన్యులుకండు"-అని తన నిర్హేతుకజాయమాన కరుణాహృదయాన్ని ప్రగల్భంగా బైట పెట్టాడు. "మహానుభావా! మీరు చెప్పే బోధను ఆలకించే తీరుబాటు మాకు లేదు. కృష్ణప్రేమలో ఉన్మత్తాలైపోయిన మాచిత్తాలకు యితర సుద్దులు వినడానికి గడియ తెరిపి లేదు. క్షమించి దయచేయండి.

"ఇనుమయస్కాంతసన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశు సన్నిధి నావిధమున।
కదలు చున్నది దైవయోగమున జేసి
బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంతమగుచు॥"

నారదుని వొళ్లంతా విస్మయంలో మునిగిపోయింది. మళ్ళీ మాట్లాడకుండా పయనం చిత్తగించి తన నోటుబుక్కులో "యథా వ్రజ గోపికానాం" — అని గోపికలయొక్క పరమోత్కృష్టమగు భగవత్ ప్రేమను వుల్లేఖించి సూత్రము వ్రాశాడు.

మూగివాడు చెక్కెర (పంచదార) దిన్నట్లు భక్తుడు తన అనుభ వాన్ని లోలోపల ఆస్వాదిస్తాడు. భక్తుడు జ్ఞాని గాకతప్పదు. జ్ఞాని

భక్తుడు గాకపోడు. భక్తిజ్ఞానాలు విడదీయరాని వస్తువులు. ఒకవ్యక్తిపై నీకు భక్తికలగాలంటే ఆతని గుణగణాలకు సంబంధించిన, పుట్టుపూర్వోత్తరాలకు సంబంధించిన జ్ఞానం — పరిజ్ఞానం వుండితీరాలి. జ్ఞానంలేక భక్తి కల్గదు. వస్తువిట్టిదని తెలుసుకొన్న తర్వాతగదా — దానిపై ప్రేమకాని ప్రీతికాని భక్తికాని కలిగేది. నీవు చాలా గొప్పవ్యక్తివి. పూజ్యుడివి, ఒకరోజు అదాటుగా పరిచయంలేని ఒక క్రొత్తగ్రామానికి పోయావు. ఆ వూరివారికి నీవు తీరాక్రొత్తమనిషివి. ఒక్కడూనిన్ను పల్కరించలేదు. కొంతసేపటికి నీ యోగ్యతా — నీ గొప్పతనం వారికి తెలిసిపోయింది. తెలుసుకొన్నతర్వాత నీపై భక్తిచూపారు. జ్ఞానం లేక భక్తి యెలా సంభవిస్తుంది? భగవంతుడిట్టివాడని తెలుసుకొన్న తర్వాతనే ఆతనిపై భక్తి వుదయిస్తుంది; ప్రేమకల్గుతుంది. జ్ఞానానికిముందు ప్రవర్తించేభక్తిని సాధనభక్తి అని, జ్ఞానంకల్గిన తర్వాత ప్రవర్తించేభక్తిని సాధ్యభక్తియని పేర్కొంటారు.

సగుణభక్తుడు శ్రేష్ఠుడా? నిర్గుణభక్తుడు శ్రేష్ఠుడా? అని అర్జునుడడిగిన ప్రశ్నకు భగవంతుడు సమాధానం చెప్పాల్సివుంది.

“ఓ అర్జునా! నాయందె మనస్సునిల్పి మహాశ్రద్ధతో నా సగుణరూపాన్ని యెడతెగక సేవించువారే ఉత్తమయోగులని నా అభిప్రాయం”

భగవద్గీత — పన్నెండో అధ్యాయం — భక్తియోగంలో యిది రెండో శ్లోకం. పవిత్రమూ రమ్యమూ మధురమూనైన సగుణభక్తి యిచ్చట ముచ్చటగా ప్రసంగింపబడింది. ఇట్టి ఘట్టం కాబట్టే యీ అధ్యాయం బహుముఖాల లోకప్రియమైపోయింది. పండిత మదన మోహన మాలవ్యాగారు హరిజనులకు శుద్ధిసంస్కారాన్ని నడిపి వారికి గాయత్రీమంత్రాన్ని ఉపదేశిస్తూ, భగవద్గీతలోని యీ పన్నెండో అధ్యాయాన్ని కంఠపాఠము చేసికొండంటూ వారికి హితబోధచేశారు. మహాత్మా గాంధీగారికి యీ అధ్యాయమంటే యెంతోప్రీతి. మొత్తము గీతనంతా కంఠపాఠము చేయలేకున్నా, యీ అధ్యాయాన్ని అయినా ప్రతివాడూ కంఠస్థం చేయాలని ఆయన సలహా. సగుణభక్తులకు యీ అధ్యాయం మరింతా మధురమయింది. గాంధీగారు పరమభక్తుడు, జీవించివున్నం

తకూ స్వరాజ్యమని ఖద్దరని అస్పృశ్యతా నివారణమని హరిజనసేవయని పరితపించిన గాంధీగారు, తీరా ప్రాణాలను వదిలేటప్పుడు "హేరామ్" అన్నారు. ఖద్దరులేదు — రాట్నంలేదు — నిజంగా ఆయన హృదయంలో రాముడే వుండినాడు.

శ్రీకృష్ణుని అభిప్రాయంలో ఉత్తమ యోగులంటే ఎవరు? తనయందు — భగవంతునియందు మనస్సుపెట్టినవారు. స్త్రీలు — పురుషులు, చిన్నలు — పెద్దలు, పండితులు — పామరులు, అవర్ణులు — సవర్ణులు అనే పట్టింపులేదు. వాసుదేవ పరమాత్మునిలో మనస్సుపెట్టినవాడే ఉత్తమయోగి. వియోగులంటే — ఏమేమో వికారమైన అర్థాలు మనం చేసుకొన్నాం. అస్తులు వస్తులుండి వటించేవాళ్లను, గోళ్లు గడ్డాలు పెంచినవాళ్లను, కొండల్లో గుహల్లో వుండేవాళ్లను, గోచిపాతరాయుండ్లను యోగులని మనము భావించాము. "భగవంతునియందు మనస్సుంచినవాడే యోగి — మహాయోగి" అని సాక్షాత్తు శ్రీకృష్ణుని అభిప్రాయం. సామాన్యమానవులు సంసారంలో మనస్సుంచుతారు. యోగులు భగవంతునిలో మనస్సుంచుతారు. మనస్సు ద్రవవస్తువులాంటిది. నీరు ఏపాత్రలో పోస్తే ఆ పాత్రయొక్క ఆకారాన్ని ధరిస్తుంది. చతుష్కోణం పాత్రలోని నీరు చతుష్కోణంగా వుంటుంది. షట్కోణం పాత్రలో షట్కోణంగానూ, గుండ్రని పాత్రలో గుండ్రంగానూ నీరు వుంటుంది. ఆలాగే మనస్సుసైతం యేవస్తువునందుంచితే ఆవస్తువుయొక్క ఆకారాన్ని ధరిస్తుంది. విషయాలల్లోచేరి విషయాకారాన్ని, భగవంతునిచేరి భగవదాకారాన్ని ధరిస్తుంది.

లీలావతారుడు షోడశకలాధారుడు పూర్ణ పురుషోత్తముడు అయిన శ్రీకృష్ణదేవుని దివ్యసుందర విగ్రహాన్ని క్షణమాత్రం చూడకపోతే గోపికలు తహతహ పొందేవారు.

"యుగాయితం నిమేషేణ — చక్షుషా ప్రావృషాయితం।
శూన్యాయితం జగత్సర్వం — గోవిందవిరహేణ మే॥"

"శ్రీకృష్ణుడు కనబడకపోతే నిమిషము యుగంగా వుంటుంది. కాలమేఘాలు కళ్లల్లోనే నివసిస్తాయి. జగత్తు శ్మశానంలా బావురు

మంటుంది." — అది భక్తప్రభువు గౌరాంగుడు చెప్పినట్లు గోపికలు నిరంతర. కృష్ణసందర్శన కుతూహలంతో మైమరచేవారు. ఒకగోపికకు కృష్ణుని చూడాలనే కాంక్ష ప్రక్కేళ్లురికింది. తాను పెద్దలచాటున మెలగవలసినదై వుండే పరిస్థితిలో స్వతంత్రించి కృష్ణదర్శనానికి పోయే వీలెక్కడిది? ఎట్లో మనసుపట్టుకొని సాయంకాలంవరకు కాలం గడిపింది. సాయంత్రం దీపాలు ముట్టించేవేళ. ఆ కాలంనాటి వాడుకచొప్పున ప్రమిదా — వత్తి తీసుకొని ముట్టించుకొని వచ్చేకోసం నందుని యింటికి ఆ గోపబాలిక తానే బయలు దేరింది. నందునియింట దీపం ఎప్పుడూ వెల్గుతూంటుంది. ఆవూరివారంతా సందెవేళ అక్కడికిపోయి దీపం ముట్టించుకొనేవారు. ఆ బాలిక నందుని గృహాన్ని ప్రవేశించింది. దీపపు గూటివద్దకుపోయి నిల్చింది. దీపదర్శనంతోపాటు — "నందతపఃఫలంబు సుగుణంబుల పుంజము గోపకామినీ — బృందము నోమువంట"ను — సత్యశివసుందర సర్వమంగళ విగ్రహాన్ని — శ్రీకృష్ణుని కన్నుల కరువుదీర దర్శించింది. నందుని యింటిలోని ఆ సజీవ దీపాన్నిచూచి, పాపము ఆ ముద్దరాలు యీ నిర్జీవదీపాన్ని మరిచింది. దీపంవద్ద వత్తినిబెట్టి వెల్గించేబదులు ఆమె పరధ్యానంతో వ్రేలు పెట్టి వేసింది. అగ్నికి కనికరమేముంది? వ్రేలు తెగకాలిపోతూంది. ఆమె దేహాన్నే కాదు; ప్రపంచాన్నే మరిచింది. ఆమెచిత్తము ఆమెలో లేదు. ప్రపంచములోనూలేదు. భక్తితో కరిగిన ఆమనస్సు భగవంతునిలోకలిసిపోయింది. యశోద ఒక్కపరుగునవచ్చింది. "ఏమిటమ్మా! నిద్రపోతున్నావా ఏమి? మీ యింటివారు రాత్రిళ్లు నిన్ను నిద్రపోనిచ్చుటలేదా ఏమి?" అంటూ ఆ బాలికను మెలకువలోకి తెచ్చింది.

"మయ్యావేశ్య మనో యే మాం"— నాయందు మనస్సుంచిన వారు, అని భగవంతుడన్న మాటకు యిదే అర్థం. మరీ వారెట్లుండాలి? "శ్రద్ధయా పరయోపేతాః" — గాఢమైన శ్రద్ధకల్గినవారై వుండాలి. అనుకూల పరిస్థితులలోవుండి ప్రతికూల పరిస్థితులలో పారిపోయే టక్కరి శ్రద్ధకాకుండా, ప్రపంచము ఒతికల పడనీ — చతికల పడనీ, కట్టుకదలని — చెక్కుచెదరని సజీవశ్రద్ధ అమరివుండాలి. శ్రద్ధలేనిచోట మనస్సు నిలువదు కూడా. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" — అని గీతలోని మహామంత్రం.

ఇది అష్టాక్షరీ మంత్రంలాగా వ్రాసిపెట్టుకోవాలి. విచారసాగర గ్రంథ కర్తయగు సాధు నిశ్చలదాసుగారు శ్రద్ధనుగురించి ఒకవిషయం చెప్పారు. అదే చెబుతాను. తత్త్వజ్ఞానాన్ని కోరేవానికి వుండవలసిన అధికారి లక్షణాలు తొమ్మిది. వివేకము—వైరాగ్యము — శమము దమము ఉపరతి తితిక్ష సమాధానము శ్రద్ధ—ముముక్షుత్వము. శమాదుల నారింటిని ఒక్కటిగచేర్చి శమాది షట్క-సంపత్తి అంటారు. ఆక్రమంలో, వివేకము వైరాగ్యము — షట్క-సంపత్తి — ముముక్షుత్వము, యీ నాల్గింటిని సాధన చతుష్టయ సంపత్తి అంటారు. ఇందులో శ్రద్ధ అనేది ముముక్షుత్వానికి కేవలం సన్నిహితంగా వుంటుంది. కాబట్టి దానిస్థానం తక్కినవాటికంటె హెచ్చు. అయితే ఆ శ్రద్ధ అంధశ్రద్ధై వుండరాదు. వివేకశ్రద్ధ — విచార శ్రద్ధ కావాలి. శ్రద్ధ పాత్రవంటిది. తక్కిన దైవీగుణాలన్నీ వస్తుసామగ్రుల వంటివి. వస్తువులను భద్రపరచేటందుకు పాత్ర లేకపోతే ఆ వస్తువులు తెచ్చినవి నష్టమైపోతాయి. నీవు బజారుకుపోయి యింటికి కావలసిన వుప్పూ — పప్పూ మొదలగు సరకులు తెచ్చావు. వాటిని భద్రముగా పోసి పెట్టేకోసం పాత్ర వుండాలికదా! లేకపోతే ఎలుకలు తినిపోతాయి. శ్రద్ధ తక్కిన అన్ని అధికారిలక్షణాలకు పాత్రవంటిది. శ్రద్ధలేనిచో వాటికి భద్రతలేదు; రక్షణలేదు. అయితే ఆ శ్రద్ధ వివేకంతోకూడిన శ్రద్ధైవుండాలి. మూఢ శ్రద్ధై వుండరాదు. దీనికొక వుదాహరణం చెప్తాను.

ఒక గ్రామంలో ఒక గృహస్థుడుండేవాడు. అతనికుటుంబం పది మంది వుండే పెద్దకుటుంబం. ఆ యజమాని ప్రతియేటా నవగ్రహపూజ చేయించేవాడు. నవగ్రహపూజలతో గృహశాంతి కల్గుతుందని ఆయన అభిప్రాయం. ఒకసారి ఇంటిపురోహితుని పిలిపించి పూజకు కావలసిన దినుసులను జాబితావ్రాసి యిమ్మన్నాడు. ఆ పురోహితుడు తన సంసారంలో కొదవపడవగా ఉండే సరుకులను అంతాకలిపి ఒక పెద్దజాబితా వ్రాసియిచ్చినాడు. పురోహితులపని అంతేకా! అది నవగ్రహపూజకాదు. పురోహితునిపూజ అనుకోవలసిందే. గృహయజమాని సామానులన్ని తెప్పించాడు. అయ్యగారు కొబ్బరకాయకొట్టి పూజను ఆరంభించాడు.

అంతలో ఆ యింటిలో తిరిగే పిల్లివొకటి పూజదగ్గర పెట్టిన కొబ్బరిచిప్పలను లంకించుకొని పోయేకోసం కాచుకొనివుంది. పురోహితుడు ఆ విషయం కనిపెట్టాడు. ఏమారితే పిల్లి తనకు నష్టంచేసేదే ననుకొని ఒక చిన్నగంప తెప్పించి, పూజ పూర్తిఅయ్యేవరకు పిల్లిని గంపక్రిందవేశాడు. ప్రతిసంవత్సరమూ యిదేతంతు జరుగుతూవచ్చింది. ఆ యింటిలోనివారు పిల్లిని గంపక్రిందవేయడం నవగ్రహ పూజావిధానంలో అదొక అంగమను కొన్నారు. మరుసంవత్సరంనాటికి కర్మధర్మ సంయోగంతో కాలంతీరి ఇంటిపురోహితుడు మరణించాడు. క్రొత్తపురోహితుని పిలిపించి నవగ్రహ పూజచేయాలని ఇంటియజమాని చెప్పాడు. ఆయన ప్రారంభం చేశాడు. ఇంటిలో వుండే పెద్దముసలమ్మ పురోహితుని దగ్గరకొచ్చి "స్వామీ! గంపక్రింద పిల్లినివేసేసాంగ్యం (విధానం) మీకు తెలుసా?" అని అడిగింది. ఆయనకు ఆ మాట అర్థంకాలేదు — పూరకొన్నాడు. "ముఖ్యమైన ఆ విధానం తెలియకపోతే మీ పూజే అక్కరలేదు. వేరేవాన్ని చూచు కొంటాం. పొం"డని ముసలమ్మ తెగజెప్పింది. అంతలో కుశలుడైన పురోహితుడు ఆ కిటుకు కనిపెట్టాడు. వచ్చే వరమానాన్ని తేరకు జార విడవడమెందుకని యథాప్రకారం ఆ తంతునడిపి సామగ్రులను మూట ముల్లెకట్టుకొని తనదారిన చక్కాపోయాడు. ఇట్టి మూఢశ్రద్ధతో — అవివేకశ్రద్ధతో ఫాయిదాలేదు. వట్టి నగుబాట్లు మాత్రం.

మనస్సు భగవదాకారాన్ని చెందివుండుటే నిజమైన నిత్యభక్తి. ధ్యానం చేసేటపుడు — భజనచేసేటపుడు — దేవాలయం వెళ్ళునపుడు మాత్రం మనస్సును భగవంతునిలో పెట్టడం నిత్యభక్తికాదు. భగవద్గీత అయిదో అధ్యాయంలో చెప్పినట్లు, "పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్" — కంటూ వింటూ తింటూ తిరుగుతూ, యిస్తూ తెస్తూ లేస్తూ కూచుంటూ, సర్వకాల సర్వావస్థలలో మనస్సు భగవదాయత్తమై వుండాలి. "ఈశావాస్యమిదం సర్వం" — "ఈశ్వరుడు కానివస్తు వొకటీలేదు. హరిమయము కానివస్తువు పరమాణువులేదు." విశ్వమె విశ్వేశ్వరుడు. ఇట్లు విశ్వరూపోపాసనచేసే సగుణ భక్తుడు శ్రేష్ఠతముడని భగవంతుడన్నాడు.

శ్రేష్ఠుడనికాని శ్రేష్ఠతరుడనికాని చెప్పలేదు. ఒక్కచోట్నే శ్రేష్ఠ (యుక్త) తముడని చెప్పి వాని గొప్పతనాన్ని ప్రదర్శించాడు. శ్రేష్ఠతము డనగా అంతకు మించిన శ్రేష్ఠుడు లేడని అర్థం.

ఉపాసన అంటే ఏమో కొంత వివరించుట మంచిది. ఉపాసన సగుణానికే చెందుతుంది. నిర్గుణానికి చెందదు. అయినా కానీ, నిర్గుణో పాసన అని చెప్పుట ఔపచారికంగా మాత్రం. నిర్గుణము స్వరూపస్థితి. ఉపాసనలో త్రిపుటి సంభవిస్తుంది. ఉప + ఆసనము, అనే రెండు పదాల కూడికతో 'ఉపాసన' శబ్దమేర్పడింది. ఇప్పుడు వుండేచోటు మార్చి వేరే చోట కూర్చోపెట్టమని దాని అర్థం. మనమనస్సు సంసారంలో - ప్రపంచం లోవుంది. దాన్ని యిక్కడినుండి మార్చి భగవంతునివద్ద కూర్చోబెట్టాలి.

శిశువు గర్భంలో వుండేటపుడు వానిచుట్టూ తల్లిదేహమే వుండింది. బైటికివచ్చినతర్వాత ఆమె పాలుత్రాగి పెరిగినాడు. ఆ తల్లి పాలను వేడిచేయాలని కాని, పంచదార కలపాలనికాని వానికి అపేక్ష లేదు. శిశువుకు తల్లిపాలే జీవనధార. మరికొన్నాళ్లకు ఆటబొమ్మలను మరిగాడు. వాటిపై మరులుపడి తల్లికి దూరమైనాడు. ఆడి ఆడి ఆకలి గొన్నపుడు మళ్లీ తల్లికావాలి. పాలు తల్లివద్దనేకాని మట్టిబొమ్మలలో లేవుగదా? అలాగే, తన స్థితికి - గతికి ఆధారమైవున్న పరమాత్మని మరిచి జీవుడు ప్రాపంచిక వస్తువులపై భ్రమపడ్డాడు. భార్యలని బిడ్డలని యిల్లని వాకిలని మురిసి ముప్పందుమైనాడు. కాని యివన్నీ (తోలు) బొమ్మలు మాత్రం. నిత్యసుఖం వీటిలోలేదు. నిరతిశయానందం వీటిలో లేదు. తలతిరిగి నోటికి వచ్చినపుడు "నీవేతప్ప యితఃపరంబెరుగ" నని ఒకానొకనాడు భగవంతుని సమాశ్రయిస్తాడు. విషయాధీన మనస్సు భగవదధీనమగుటే ఉపాసన. అంతేకాని, పటంవద్ద విగ్రహంవద్ద కూర్చో డంమాత్రం కాదు. అట్టి సగుణభక్తుడు మహాశ్రేష్ఠుడని శ్రీకృష్ణుని మాటలో సారాంశం.

— ద్వితీయ విశ్రాంతి —

మకాం - బంగారుపేట.

ప్రియమైన ఆత్మబంధువులారా!

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం" — నా అధ్యక్షతతోనే ప్రకృతి సమస్తప్రపంచాన్ని సృష్టిస్తూందని భగవంతుడు గీతలలో చెప్పాడు. ప్రకృతికార్యాలన్ని భగవంతుని అధ్యక్షతతోనే నెరవేర్తూన్నాయంటే మనకార్యాలు మనతో నెరవేర్తున్నాయా? లేదు. అవికూడా భగవత్ ప్రేరణతోనే జరిగిపోతూన్నాయి. అలాంటప్పుడు మధ్యలో మేము చేస్తూన్నామనే అహంకారంతో పనిలేదు. నమస్కారపూర్వకంగా అహంకారాన్ని పరమాత్మునికి సమర్పించి మన కార్యక్రమాన్ని ఆరంభిస్తాం.

భగవద్గీత — భక్తియోగం. అందులోని రెండు శ్లోకాలవరకు విచారించుకొన్నాం. తర్వాతివిషయాన్ని ఆలకించండి. శ్రీ భగవంతుడు చెబుతూన్నాడు.

"ఓ పార్థా! అక్షరము — అనిర్దేశ్యము — అవ్యక్తము — వ్యాపకము — అచింత్యము — కూటస్థము — అచలము — ధ్రువమునైన నిర్గుణతత్త్వాన్ని ఉపాసించేవారుకూడా, యింద్రియాలను నిగ్రహించినవారై, సర్వత్రా సమబుద్ధికలవారై, సకలభూత హితపరాయణులై నన్నే చేర్తూన్నారు."

మధురమంజులమైన గీతాశ్లోకాలను—అర్థంకాకున్నా సరే — పూరిక పఠించినా పుణ్యమే. మరింతాశ్రద్ధకలవారు రోజుకు ఒకశ్లోకంచొప్పున కంఠపాఠం చేస్తూపోతే రెండుసంవత్సరాలల్లో గీతను మొత్తం నేర్చుకోవచ్చు. గాంధీగారు దంతధావనం చేసేటపుడు రోజుకు ఒక్కశ్లోకం వంతున వల్లించి కంఠస్థం చేస్తూవచ్చారు. ఒక్కకాగితపు తుంటపై ఒక్కశ్లోకాన్ని వ్రాసి యెదురుగా గోడకు అతికించి పళ్లుతోముకుంటూనే దాన్నివల్లించి కంఠస్థం చేసేవారు. శ్రద్ధ కావాలికాని కానిది యేముంటుంది? ప్రపంచంలో అన్నీవున్నాయి; సోమారికి ఏమీలేవు.

భగవంతుడు అక్షరోపాసననుగూర్చి చెబుతున్నాడు. అక్షరోపాసన అనినా నిర్గుణోపాసన అనినా ఒకటే. ఆ నిర్గుణోపాసనకు అధికారి ఎవడు?

వానికి వుండాల్సిన లక్షణాలేమిటి? వాటినే చెబుతూన్నారు. (1) సన్నియమ్యేంద్రియగ్రామం. (2) సర్వత్ర సమబుద్ధయః. (3) సర్వభూత హితేరతాః — ఈ మూడూ అక్షరోపాసకుని కుండవలసిన అర్హతలు.

అక్షరోపాసకుడు యింద్రియ సముదాయాన్ని తన అధీనంలో వుంచుకొన్నవాడు కావాలి. ఇంద్రియాలు గుర్రాలు. గుర్రాలు అధీనంలో వున్నపుడే బండి గమ్యస్థానాన్ని చేరుకోగల్గుతుంది. ఇంద్రియాలను నిగ్రహించి, వాటిని అంతర్ముఖం చేసినపుడే ఆత్మజ్ఞానం లభిస్తుంది. కావలసింది పుస్తకజ్ఞానం కాదు; మస్తకజ్ఞానం. జ్ఞానము బైటినుండి లోపలికి కూరేదికాదు; లోపలినుండి బైటికి వూరేది. ఇంట్లో ఖాళీసీసాలెక్కువుంటే రోగులెక్కువున్నారని సూచన. అట్లే బహుపుస్తక వ్యాసంగం కూడా మానసిక రోగానికి గుర్తు. ఇంతకూ, స్వయంభూజ్ఞానము జితేంద్రియుని సొత్తు.

మన యింద్రియాలకు మూడు అవస్థలున్నాయి. ఒకటి — ప్రపంచంలో పారాడుట; రెండు — నిద్రపోవుట; మూడు — భగవత్పరమై ప్రవర్తించుట. మొదటిరెండూ అందరికీ సాధారణమై వున్నాయి. మూడోది మహాదుర్లభం. భగవంతునికొరకు కర్మలను చేసేవాడు ఆ ఉత్తమస్థితిని సంపాదిస్తాడు. గంటలతరబడి సభలో కూర్చొని శ్రవణం చేస్తూన్నారంటే, మీరుకూడా యింద్రియనిగ్రహాన్ని ఒక పరిమితంగా సాధించినట్లే. ఇంద్రియాలను అదుపులో పెట్టుకోగల్గినవాడే నిర్గుణోపాసన చేయగల్గేవాడు. తదన్యునికి అలవికాదు.

ఇంద్రియనిగ్రహాన్ని చెప్పి భగవంతుడు అక్షరోపాసకున కుండవలసిన రెండో అర్హతను "సర్వత్ర సమబుద్ధయః" — అని సెలవిచ్చాడు. సమస్త పరిస్థితులలో సమానమైన బుద్ధికలవాడు కావాలి. కూటికి గుడ్డకు కరువైవున్నా, కుచేలుడు తన నిశ్చయంనుండి జారిపోలేదు. దట్టదరిద్రం అనుభవిస్తూకూడా వెలితిలేనిభక్తిలో ఓలలాడాడు. బాగోగులలో సుఖదుఃఖాలల్లో మానావమానాలల్లో వృద్ధిక్షయాలల్లో— సమస్త ద్వంద్వాలల్లో మనస్సు తారుమారు కారాదు. 'సర్వత్ర సమబుద్ధి' అనేబిరుదు వానికే చెల్లుతుంది. గోడగడియారంలోని పెండలంలాగా అటూయిటూ కొట్టుకలాడే మన మనస్సుకు సమత్వమెక్కడిది?

ప్రసిద్ధభక్తుడైన తుకారామస్వామినిగూర్చి మీరు వినేవుంటారు. ఆయనభార్య గంపగయ్యాళి. అవునంటే కాదనడం. కాదంటే ఔననడం. ఒకటే వితండవాదం. "పాండురంగా! ఎంత దయామయుడవయ్యా! గయ్యాళిభార్యను అంటగట్టి సంసారంపై రోత పుట్టించావు. నన్ను ఉద్ధారకంచేశావు. ప్రభూ! నీ ఉపకారాన్ని యెంతని కొనియాడేది" — అని ఆయన భగవంతునితో మనవిచేసుకొనేవాడు. ఏదిజరిగినా మేలు కొరకే — ఇదొక సిద్ధమంత్రం.

ఏకనాథునికి అనుకూలవతియైన భార్య వుండేది. దేహాన్ని నీడ వలె, నోట్లో నాలుకవలె ఆమె భర్తను అన్నివిధాలా అనుసరించే సాధ్వీ మణి. "స్వామీ! గుణవంతురాలగు భార్యను దయచేసి నీ భక్తికి యెంతో సానుకూలం కల్పించావు. నీ దయేదయ" — అని ఆయన దేవుని ప్రశంసించేవాడు. అదీసరే — ఇదీసరే — చూచారా? "సర్వత్ర సమబుద్ధయః."

"సర్వభూతహితేరతాః".. ఇది మూడో లక్షణం. కష్టనిష్ఠురాలల్లో కూడా అందరికి మేలుచేయుటయందే తత్పరుడై వుండాలి. ఇట్టి అర్హతలు కలవారే అక్షరతత్త్వాన్ని వుపాసించకల్గుతారు. అక్షరతత్త్వాన్ని పేర్కొం టూ, అది నిరుపాధికవస్తువు కాబట్టి స్పష్టంచేసేకోసం, శ్రీకృష్ణుడు అనిర్దేశ్యము — అవ్యక్తము — సర్వత్రగము — అచింత్యము — కూట స్థము — అచలము — ధ్రువము, అని యేడు విశేషణాలు చెప్పాడు.

అక్షరమంటే పరబ్రహ్మమని అర్థం. ఆ పరబ్రహ్మతత్త్వాన్ని చక్కగా అవగాహన చేయించేకోసం ఏడు విశేషణాలు చెప్పబడ్డవి. ఇవి శాస్త్రీయవిషయాలు. ఈ విషయాలను వినాలంటే, తెలిసికోవాలంటే, అంతఃకరణానికి తగిన సంస్కారం అలవడివుండాలి. మాసినబట్టకు రంగు పట్టనట్లు విషయవాసనా పంకిలమైన అంతఃకరణానికి వేదాంతబోధలు రుచింపవు. ఈ విషయాన్ని గురించి ఒకకథ చెప్తాను.

ఒక గ్రామంలో ఒక సాహుకారు వుండేవాడు. ఆతనికి బహు కాలంనుండి అజీర్ణవ్యాధి వుండేది. మందులు మాకులు, చికిత్సలు వుపచారాలు, డాక్టర్లు వైద్యులు, కావలసిన కర్మకాండంతా ముగిసింది.

రోగం నయంకాలేదు. నిరాశతో రోజులు గడుపుతూన్నాడు. అతని పుణ్యమా అన్నట్లు ఒక మహనీయుడు తటస్థపడి షావుకారియొక్క గతి స్థితి ఆలకించి యిట్లన్నాడు. "అయ్యా! నీ రోగం తీరా నయమయ్యేది కాదు. ఉపశాంతికొక చిట్కా చెబుతాను. దాన్ని ఆచరిస్తావో, కొంత నెమ్మది లభిస్తుంది. నల్ల వుప్పురాళ్లను జేబులో వేసుకొనివుండి యెడతెగకుండా నోటిలో వేసుకొంటూ ఆ రసాన్ని — ఆ వుప్పటను మింగుతూండు. నీ రోగానికి వుపశాంతి లభిస్తుంది."

ధనవంతుడా పథకాన్ని అనుసరించాడు. కొంతసుగుణంగానే వుంది. ఎడతెగకుండా నోటిలో వుప్పురాయి వుంచుకోడం అతనికి అలవాటై పోయింది. ఇలా జరుగుతూండగా, ఒకరోజు దీపావళి పండుగ వచ్చింది. ప్రతిదీపావళికి పిల్లవాండ్లకు మిఠాయి పంచిపెట్టుట ఆయన రివాజు. స్వయంగా మిఠాయి అంగళ్లకుపోయాడు. మిఠాయిదుకాణాలన్నీ ఒకే శ్రేణిలోవున్నాయి. మొదటి దుకాణంవద్దకుపోయి ఒక్కమణుగు మిఠాయిని బేరం చేశాడు. బేరం కుదిరినతర్వాత సరుకు ఏలాగుందో రుచిచూచేకోసం కాస్త 'శాంపిల్' తీసుకొని నోట్లోవేసుకొన్నాడు. దవడలో యీవరకే ఖాయంగావుండే నల్లుప్పుకల్లు - దానిరసం కలియుటతో మిఠాయి వుప్పగావుండింది. ఆ సరకు బాగాలేదని రెండో దుకాణానికి పోయాడు. అక్కడ ఇదేగతి. వరుసగా అంగళ్లన్నీ దాటివేస్తున్నాడు. చివరిలోవుండే అంగడివాడు యీ ధనికుడు పడేపాట్లన్నీ చూస్తూన్నాడు. తీరామారా తనదగ్గరికి వచ్చి బేరం మొదలుపెట్టగానే "మహారాజా! ఆ కొళాయి (పంపు) దగ్గరికిపోయి ముందు నోరు శుభ్రంగా కడిగికొని రాండి. తర్వాత మాట్లాడ్తా" నన్నాడు. ఆ సాహుకారు అతడు చెప్పినట్లు చేశాడు. నోరు శుభ్రంగా కడుగుకొని వచ్చిన తర్వాత మిఠాయిని నోట్లోవేసుకొన్నాడు. తియ్యగావుంది.

నోట్లో ఉప్పుగల్లు పెట్టుకొని ఎంత మంచి మిఠాయితిన్నా ఉప్పుప్పగా వుండక తప్పదు. వెనుకటి విషయవాసనలను అంతఃకరణములో పెట్టుకొని యెన్నెన్నిసార్లు వేదాంతశ్రవణంచేసినా అది రుచించదు; అర్థంకాదు; వొంటపట్టదుకూడా. ధృతరాష్ట్రునిగతి ఏమైంది?

ఈషణాత్రయాలతో మురిగిపోతూండే అంతఃకరణంతో భగవద్గీతను విన్నాడు. వానికి ఫలం సున్న అయింది. పూర్వవాసనలన్నీ తుడిచివేసి నిర్మలమైన అంతఃకరణంతో అర్జునుడు విన్నాడు, కాబట్టి అతనికి గీతాబోధ సార్థకమైంది.

ఆత్మీయులారా!

భగవద్గీతా తత్త్వాన్ని వినేటప్పుడు - వేదాంతశ్రవణం చేసేటప్పుడు అంతఃకరణంలోని పూర్వవాసనలను గ్రుమ్మరించి కాళీచేసి నిర్మలంగా ఆలకించండి. చెప్పే విషయంతో మనస్సు ఏకాకారమైనప్పుడే శ్రవణమనిపించుకొంటుంది. పనిపాటలు వదలిపెట్టి అదేపనిగా వినేటందుకు వచ్చి కూర్చొన్నారు. ఎందుకొచ్చామో, ఆపనిలో శ్రద్ధవహించవద్దా? కొందరికి మెల్లగా నిద్ర ఆవేశిస్తుంది. మరికొందరు బొందెతో యిక్కడేవున్నా, వారిచిత్తం దేశదేశాలు సంచరిస్తూంటుంది. పాడుమనస్సుకు రెండే అవస్థలు పట్టుపడ్డాయి. ఒకటి శూన్యావస్థ. అదే నిద్ర. మరొకటి విక్షేపావస్థ. ఇదే చంచలస్థితి. ఈ రెండూకాక ఏకాగ్రావస్థ అనేదికూడా మనస్సుకుంది. కాని ఆ శ్రేష్ఠమైన యేకాగ్రావస్థ యేపుణ్యాత్ములకో లభిస్తుంది.

అవాంతర సిద్ధాంతాలుగా ఆ యావిషయాలను చెప్పినా భగవద్గీతకు జ్ఞానమే ముఖ్యసిద్ధాంతం. జ్ఞానమంటే వృత్తిజ్ఞానంకాదు. ఇదో మామిడిపండు. దీన్ని పండని తెలుసుకోడంకూడా జ్ఞానమే. కానీ యీజ్ఞానం అంతఃకరణంలోని సత్త్వగుణానికి సంబంధించిన వృత్తిజ్ఞానం. "సత్త్వాత్ సంజాయతే జ్ఞానం" — యీ సాత్త్వికజ్ఞానమే — విషయాలను తెలిసికొనే వృత్తిజ్ఞానమే, శ్రీకృష్ణుడు బోధించిన జ్ఞానమంటూ భ్రమింపరాదు. శ్రీకృష్ణుడు బోధించింది స్వరూపజ్ఞానం. వృత్తిజ్ఞానం వికారశీలమైంది. స్వరూపజ్ఞానం నిత్యమైంది.

జ్ఞాని నిర్గుణోపాసకుడు. ఆత్మాభిన్నమైన పరబ్రహ్మమే వానికి ఉపాస్యం. అక్షరమని చెప్పబడే ఆ పరబ్రహ్మానికి యేడు విశేషణాలు చెప్పారు. దుర్బోధ్యమైన విషయాన్ని మనస్సుకు అవగాహన చేయించాలంటే యెన్నోవిధాల నూరిపోయాలి. రకరకాలైన సాధన శాకపాకాల సహాయంతో అన్నాన్ని ఆరగించినట్లు విధవిధాలైన దృష్టాంతయుక్తులతో వేదాంతాన్ని ఆకళించుకోవాలి.

అక్షరపరబ్రహ్మమెట్టిది? అది అనిర్దేశ్యము. అట్టిదిట్టిదని నిర్దేశించు టకు వీలుగానిది, అనగా అప్రమేయవస్తువని అర్థం. ప్రత్యక్షాది ప్రమా ణాలకు అందుబాటయ్యే వస్తువును ప్రమేయమంటారు. పరబ్రహ్మము ప్రత్యక్షాది ప్రమాణాలకు విషయంకాదు. కాబట్టి అది అప్రమేయం. బ్రహ్మతత్వాన్ని యింద్రియాలు పట్టుకోలేవు; మనస్సు వూహించలేదు. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అన్నిప్రమాణాలకు ప్రమాణత్వసిద్ధి కల్గించే మూలప్రమాణవస్తువుకు ప్రమాణమేముంటుంది? "విజ్ఞాతారమరేకేన విజానీయాత్" — అని యాజ్ఞవల్క్యుని సందేశం. అన్నింటిని ఎరిగేవానిని యెరిగేవాడెవడు?

"అవ్యక్తం" — ఇది రెండోవిశేషణం. జాతిగుణక్రియాసంబం ధాలనే నాల్గులక్షణాలతో వస్తువును నిర్ణయించొచ్చు. ఈ నాల్గూ లేని దాన్ని ఏమని వ్యక్తంచేయాలి? నేతినేతీతి వాక్యాలద్వారా — అతద్ వ్యావృత్తి పూర్వకంగా, అనాత్మవస్తువులను నిషేధించుటతో శబ్దప్రమా ణమైన శాస్త్రము సార్థకమైతుంది. కాని దానిని వదిలేస్తే స్వయంప్రకాశ వస్తువు తానుగా మిగిలివుంటుంది. ఈ విషయాన్ని, స్పష్టంచేసేకోసం ఒక ఉదాహరణ చెబుతాను.

పితృవాక్యాన్ని పరిపాలించేకోసం సీతారామ లక్ష్మణులు ముని వేషాలను ధరించి అరణ్యానికి వెళ్ళారు. ఆ అరణ్యవాసులైన మునులు అవతారమూర్తులైన సీతారామ లక్ష్మణులను సత్కరించేకోసం అత్రి ఆశ్రమంలో ఒక పెద్ద సభను జరిపారు. ఋషులంతా ఒకప్రక్క — ఋషి పత్నులంతా ఒకప్రక్క కూర్చొనియున్నారు. ఋషివేషాన్నిధరించి ఋషి మండలిలో కూర్చొనియున్న రామచంద్రుని ఋషిపత్నులు గుర్తించలేక పోయారు. సీతాదేవి ఆ ఋషికాంతలలో కలిసి కూర్చొనివుంది. ఆడ వాండ్లు పదిమందికూడితే వూరకేలావుంటారు? ఆ ఆచారం అప్పటికిప్పటికి అవిచ్ఛిన్నంగావుంది. "అమ్మా! నీ భర్త ఎవరు?" — అని సీతమ్మను గ్రుచ్చి అడిగారు. అంతసభలో 'అతడే నా పతి' అని సభ్యతనెరిగిన స్త్రీ, వ్రేలుపెట్టి యేలాచూపగల్గుతుంది? ఆమె పలుకలేదు. ప్రక్కలోనివారు వూరుకోలేదు. ఊరకుంటే ఆడవారేలాఔతారు! పేరుసార్థకం చెయ్యొద్దా

మరి! "అమ్మా! ఆయనేనా?" అని ఋషిజనంలో ఒక్కొక్కని తట్టు వ్రేలుచూపి వరుసగా అడుగసాగారు. తప్పనిసరి కాబట్టి సీతాదేవి కాని వారినందరిని ఊహూఁ ఊహూఁ అని తల అడ్డంవూపుతూ నిషేధిస్తూ వచ్చింది. శ్రీరామునిచూపించి ఆయనేనా అని అడిగేసరికి సీతమ్మ ఊఁ అనలేదు; ఊహూఁ అనలేదు. సీత వూరకుండుటతో శ్రీరాముడు ఆయనేనంటూ వారు నిశ్చయించుకొన్నారు.

"మౌనవ్యాఖ్యాప్రకటిత పరబ్రహ్మతత్త్వం" — పరబ్రహ్మ తత్త్వాన్ని ప్రకటించుటకు మౌనమే తగినభాష. మౌనభాషతోనే సీత వారి సందేహాన్ని తీర్చింది; వస్తునిశ్చయం చేసింది. అట్లే, శాస్త్రాలు అనాత్మపదార్థాలను నిషేధించి కృతార్థాలై తాయి. బుద్ధిసైతం ఉపాధులను కాదుకాదని త్రోసిపుచ్చుటేకాని వస్తువును చూపించలేదు. స్వయం ప్రకాశవస్తువును ఒకరు చూపవలసిన పనేమి?

విచారసాగరంలో శ్రీ నిశ్చలదాసుగారు "మతి న లభ్యై జిహి మతి లభ్యై" అనిచెప్పారు. దేనిని బుద్ధితెలుసుకోలేదో బుద్ధి నేది తెలుసుకొంటుందో — అదే పరబ్రహ్మతత్త్వమని ఆ వాక్యానికి అర్థం. బుద్ధి తెలుసుకోలేదని విచారసాగరకర్త నిశ్చలదాసుగారు చెబితే "బుద్ధి గ్రాహ్య మతీంద్రియ" మని ఆరో అధ్యాయంలో భగవంతుడు చెప్పాడు. "ఇంద్రియాలకు గ్రాహ్యంకాదు; బుద్ధికి గ్రాహ్యమైతుం"దని దాని అర్థం. బుద్ధి తెలుసుకోలేదని నిశ్చలదాసు చెప్పినచోట మలినబుద్ధి—విషయాకారబుద్ధి తెలుసుకోలేదని అన్వయించుకోవాలి. "బుద్ధి తెలిసికొంటుంది." — అని శ్రీకృష్ణుడు చెప్పినచోట, శుద్ధబుద్ధి — అంతర్ముఖబుద్ధి తెలుసుకోగల్గుతుందని అన్వయించుకోవాలి. ఈవిధంగా ఆ రెండు వాక్యాలకు సమన్వయాన్ని పొసిగించుకోవాలి.

బుద్ధి జడమైనా అనాత్మవస్తునిషేధంద్వారా ఆత్మజ్ఞానానికి సాధనమైతుంది. లక్షలాది కిమ్మత్తుగల బంగారానికి ధర నిర్ణయించేటందుకు, దాని వన్నెచిన్నెలను తేల్చేటందుకు రెండణాల రాతిముక్క — గీటురాయి ఉపకరిస్తుందిగదా! అట్లే అఖండవ్యాపక సచ్చిదానందాత్మను తెలుసుకొనేకోసం—భౌతికమూ, జడమూ అయినాకూడా శుద్ధబుద్ధి వుపకరిస్తుంది.

అన్ని వస్తువులూ ఉచ్ఛిష్టమయ్యాయి. పరబ్రహ్మము మాత్రం ఉచ్ఛిష్టం కాలేదని శ్రీ రామకృష్ణ పరమహంస చెప్పారు. బ్రహ్మము "అవ్యక్తం" అనే విషయాన్ని పరమహంసగారు మాటమార్చి బోధించారు.

పరబ్రహ్మము దృశ్యవస్తువు కాదు, కాబట్టి అట్టిదిట్టిదని నిర్దేశింప వీలుకాదు. ఇంద్రియాలకు అందదు; ఊహాపోహాలకు వశంకాదు. మన యింద్రియాలు విషయాలను పట్టుకొంటాయి కాని, తమకు అధిష్ఠానమైన ఆత్మను గ్రహించలేవు. పోలీసు దొంగను పట్టుకొంటాడు కాని, మేజస్ట్రేటును పట్టుకోలేడుగదా! మరి — ఆత్మసాక్షాత్కారమంటే ఏమంటారా? అంతఃకరణంలోని దోషప్రతిబంధాలు తుదముట్ట నశించాక, నిర్మలమైన అంతఃకరణంలో ఆత్మస్వరూపం ప్రతిబింబిస్తుంది. అట్టి ఆత్మాకారాకారిత వృత్తివలన అనాద్యవిద్య విధ్వంసమైపోతుంది. ఇక మిగిలిందేమి? "పూర్ణమదః పూర్ణమిదం" —

అంతఃకరణము పరిశుద్ధం కావాలంటే, దానిలోని సంకల్ప వికల్పాలు — ఊహాపోహాలు — అహంకారమమకారాలు, మటుమాయమైపోవాలి. ఈ సందర్భానికి తగిన ఒకకథ జ్ఞప్తికొచ్చింది. చెప్తాను. ఆలకించండి.

అది ద్వారకానగరం. కిరీటంలేని రాజై శ్రీకృష్ణచంద్రుడు పాలిస్తున్నాడు. ఆ నగరంలో పేరుమోసిన చిత్రకారుడొకడుండేవాడు. మనిషిని ఒక్కసారి చూస్తేచాలు రవంత ఒచ్చంలేకుండా ఫోటోను వ్రాస్తాడు. ఒక్క అవయవాన్ని చూపితేచాలు. తన అసమానప్రజ్ఞా కౌశలంతో మొత్తం స్వరూపాన్నంతా చిత్రిస్తాడు. చిత్రకళపై వానికి నిరంకుశాధికారం. ఆ దెబ్బతో వానియశస్సు దిగంతకాంతా సీమంతాలను చుంబించింది. "అత్యుచ్ఛ్రియః పతనహేతుః" — ఎన్నాళ్లీ మిద్దెలపై పరుగులు? విద్యేమిటి? యశస్సేమిటి? పలుకుబడి ఏమిటి? వానికి కన్నుమిన్ను కానరాలేదు. "ధనమును విద్యయు వంశంబును దుర్మతులకు మదంబు బొనరించును" — అన్న భారతసూక్తి అబద్ధమౌతుందా? చేసినతపస్సు వొంటబట్టకపోతే కోపమైతుందని, సంపాదించిన జ్ఞానం జీర్ణంకాకపోతే అహంకారమైతుందని పెద్దలు చెప్తుంటారు.

ఆతడు దేశవిదేశాలల్లో సన్మానపత్రాలను సంపాదించాడు. మెడల్సుకు సర్టిఫికెట్లకు లెక్కాపత్రంలేదు. వాని పొగరుబోతుతనం ప్రకృతి మించి రాగానపడింది. ఆయాదేశాలతో — ఆయాదాసర్లతో పనేం? సాక్షాత్తు శ్రీకృష్ణుని ఫోటోవ్రాసి సెభాషనిపించుకొని ఆయన దస్తూరీతో సర్టిఫికెట్టు పొందాలనుకొన్నాడు. సరాసరి రాజనగరికి పోయాడు. సుధర్మా మధ్యపీఠంబున శ్రీకృష్ణదేవుడు ఒడ్డోలగంలోవున్నాడు. గండు ముదిరిన చిత్రకారుడు తటపటాయించక సత్రున కృష్ణుని ముందుకుపోయి నమస్కరించి నిలిచాడు. ఎవరయా నీవు? అని భగవంతుని ప్రశ్న. "ప్రభూ! నేను జగమెరిగిన చిత్రకారుణ్ణి. చూడండి, నా సర్టిఫికెట్లు. బోలెడున్నాయి.

"అబ్బో! గొప్పవాడివే! అయితే ఏం విశేషం?"

"స్వామీ! మీ ఫోటోకూడా వ్రాసుకొస్తాను. నాకు ఖుద్దున మీరు సన్మానపత్రమూ సర్టిఫికెట్టూ యివ్వాలి."

"మంచిదే! ఎన్నాళ్లకు వ్రాసుకొస్తావ్?"

"సరిగ్గా వచ్చే యిదే వారం రోజుకు"—

"వెళ్లు."

చిత్రకారుడు గమనికతో శ్రీకృష్ణుని స్వరూపాన్ని ఆపాదమస్తకం కుట్టి కుట్టి చూచి నేరుగా తన యింటికెళ్లాడు. ఈ పందెంలో ప్యాస్ అయ్యాడా — ఇక పో — తనకత్తికెదురులేదు. తాను సర్వతంత్ర స్వతంత్రుడు. తన ప్రఖ్యాతి "నల్లేరుపై బండి నడచినట్లు" — మెదడు బ్రద్దలు చేసుకొని — కంటిలో వత్తిడికొని రాత్రింబవళ్లు సతమతమై శ్రీకృష్ణుని చిత్రపటాన్ని తయారుచేశాడు.

ఆ రోజే వాయిదా "ఏమయ్యా! ఫోటో తెచ్చావా? ఏదీ చూపు మరి. వెనుకాముందు చూస్తావెందుకు? ఫోటో వ్యాత్యాసంగా వుందా? తప్పిపోయింటే యింటికే వెళ్లి సరిచేసికొని మళ్లీరా! ఎప్పుడు తెస్తావ్?" అంటూ ఊపిరి సల్పనీకుండా — జవాబుతో పనిలేకుండా, శ్రీకృష్ణుడు చిత్రకారునిపై ప్రశ్నలు కురిపిస్తున్నాడు. చిత్రకారుడు తత్తఱపాటుతో పటముతట్టూ కృష్ణునితట్టూ పదేపదే చూస్తున్నాడు.

అదేమి ఖర్మమో! పటంలో వ్రాసిన కృష్ణునికి కుర్చీపై కూర్చునివుండే కృష్ణునికి కొంత వ్యత్యాసంగానే వుంది.

'దేవా! కొంచెం పొరబాటు జరిగింది. ఈసారి వారానికి చక్కగా వ్రాసుకొస్తాను.' అని సెలవుతీసుకొని ఆర్టిస్టు (చిత్రకారుడు) స్వగృహం చేరుకొన్నాడు. మళ్లీ అదేపాఠం. తిరిగీ అదేవరుస.

చిత్రకారునికి శృంగభంగమైంది. ఎన్నిమార్లు వ్రాసుకెళ్లినా శ్రీ కృష్ణుడు మారి కూర్చొనుంటాడు. పాపం! తానేమిచేస్తాడు మరి? నెత్తికెక్కిన కన్నులు క్రిందికి దిగాయి. గత్యంతరం తోచుటలేదు. స్వయం కృతాపరాధం. ఫోటో వ్రాయకపోతే పరువుప్రతిష్ఠ మంటకలుస్తుంది. మాననుకాదు; పూననుకాదు. గండాంతరసమస్య వచ్చిపడింది. ద్వారకలో మొగమెత్తి తిరిగేటట్లులేదు. కాలికిబుద్ధిచెప్పి మిన్నులువ్రాలినచోట జీవయాత్ర సాగించేది మంచిది.

మథనపడిపడి చిత్రకారుడు చీకటివిచ్చకముందే ప్రక్కదారిన పలాయనం చిత్తగించాడు. మార్గమధ్యంలో నారదుడు అడ్డానైనాడు. పూర్తిగావాని ఉదంతమంతా చెప్పేవరకు విడలేదు. నారదుడు సామాన్యుడా మరి? కానీ (పైసా) తీసుకొని కరిపించుకొంటే అణాయిచ్చినా వదలడు.

"పిచ్చివాడా! నీ తెలివి తెల్లవార! భగవంతుని స్వరూపాన్ని వ్రాస్తానని పూనుకొన్నావా? అది నీతరంకాదు. భూమ్యాకాశాలు పట్టక పదంగుళాలు పైగా మిగిలినవాన్ని (అత్యతిష్ఠద్దశాంగుళం) మూరెడు చట్టంలో పట్టించాలనా నీ దురహంకారం? మూఢుడా! పద్ధతి అదికాదు. ఒక కీలకం చెబుతాను. ఆ పనిచేస్తే సరిపోతుంది."

నారదునిద్వారా గురూపదేశంపొంది చిత్రకారుడు తిన్నగా యింటికిపోయి సర్వసన్నద్ధమై కృష్ణుని దర్బారుకు వచ్చాడు. ఆసమయాన నారదుడుకూడా కృష్ణుని సరసన వున్నతాసనంపై ఆసీనుడై యున్నాడు. చిత్రకారుడు వచ్చాడని సభలో గుసగుసా — కలకలం బైలుదేరింది. అత డొచ్చి శ్రీకృష్ణునికి నమస్కరించి నిలబడ్డాడు. "ఏదీ_ ఫోటో చూస్తా" మంటూ కృష్ణుడు చేయి చాచాడు. గొబ్బున దానిపై ముసుకును వూడ్చివేసి పటాన్ని శ్రీకృష్ణుని చేతులకు దబ్బున అందించాడు. అది

పటంకాదు. శుభ్రమైన అద్దం, నిలువుటద్దం. కృష్ణుడు చకితుడైనాడు. చిత్రకారుడు ఏమీ ఎరుగనట్లున్నాడు. "చూచుకోండి. ఒక అవతారం కాదు — వెయ్యి అవతారాలెత్తి బాగాచూచుకోండి. బొమ్మ మీలాగానేవుందా? అన్యాయంగా చిత్రకారుని గోడాడించా"రని పల్కుతూ నారదుడు ఫక్కున నవ్వాడు. సభ గొల్లుమనింది.

సంకల్ప వికల్పాలు - ఊహాపోహాలన్నీ సమసి బుద్ధి అద్దంలాగా అయినపుడే భగవత్స్వరూపాన్ని ఆకర్షించ గల్గుతుంది. ఇదంతా ప్రసంగ వశాత్తు అవాంతరంగా వచ్చిన విషయం. ఇక మన జాడకు పోదాము.

"సర్వత్రగం" - ఇది మూడో విశేషణం. పరబ్రహ్మము అంతటా వుండేది. త్రివిధ పరిచ్ఛేదాలు లేనిదని అర్థం. ప్రపంచములోని దృశ్య పదార్థాలన్నీ త్రివిధ పరిచ్ఛేదాలతో కూడివున్నాయి. దేశగత పరిచ్ఛేదం - కాలగత పరిచ్ఛేదం - వస్తుగత పరిచ్ఛేదం, అంటూ పరిచ్ఛేదాలు మూడు విధాలు. దేశకాలవస్తువులు పరమాత్మునిలో కల్పింపబడ్డవి కాబట్టి వాటి పరిచ్ఛిన్నత్వదోషం పరమాత్మునికి అంటుకోదు.

పరమాత్ముడొక దేశంలో వున్నాడు; వేరొక దేశంలో లేడని చెప్పరాదు. "చక్రి సర్వోపగతుడు - అంతటగ గలడీశుండు". ఒక నక్క ఒకరోజు భూదేవితో ఒక కానీ (పైసా) అప్పుతీసుకొందట. తీసుకొన్న బాకీ తిరిగి యివ్వకుండా ఎగరెయ్యాలనే యోచనతో జిత్తులమారి జంబుకము, రాత్రికి రాత్రి నలభై మైళ్లు పరిగెత్తింది. తీరా అంతదూరం పరుగెత్తి యిక భూదేవితో పేచీ లేదనుకొంది. కానీ, నిలిచీ నిలవకముందే భూదేవత 'నాపైసా నాకి'మ్మనింది. తానెంతదూరం పరుగెత్తినా ఆ చోట ముందుగానే భూమివుంది. అట్లే యింద్రియగోచర - మనోగోచర వస్తువులన్నిటా పరమాత్ముడు వ్యాపించివున్నాడు. కార్యవస్తువులు వ్యాపకమైవుండలేవు. అన్నింటికి కారణమైన పరబ్రహ్మము సర్వవ్యాపకము. దాన్నే సర్వత్రగమన్నారు.

అచింత్యమనేది నాల్గోవిశేషణం. పరబ్రహ్మము అట్టిదిట్టిదని చింతించేటందుకు అలవిగానిది. చింతించే సాధనము మనస్సు. మనస్సు జడం కాబట్టి స్వతాగా దానికి ఆ శక్తిలేదు. ఇంతకుముందు అనిర్దేశ్యమనే

విశేషణాన్ని చెప్పాము. ఆచోట చెప్పిన విషయాలు యిచ్చట అన్వ యిస్తాయి.

ఇక ముందుకు పోదాము. అక్షరవస్తువు మరీ యెట్టిది? అది కూటస్థం. కూటమంటే కమ్మరివాని దాగలి. స్థిరంగావుండే దాగలిని ఆధారంచేసుకొని కమ్మరివాడు, ఎన్నో సామానులను దానిపై తయారు చేస్తాడు. ఎన్నెన్ని మారినా దాగలి తాను మారదు. పరమాత్ముడు దాగలివలె స్థిరమైనవాడు. ఆతని ఆధారంతో నామరూప ప్రపంచాలు నిరంతరం మారిపోతూంటాయి. ఎన్నిమారినా ఆయన మారదు.

పన్నెండవ అధ్యాయం పదారవ శ్లోకములోని కూటస్థమనే శబ్దానికి శ్రీమచ్ఛంకరాచార్యులవారు అక్కడి సందర్భాన్నిబట్టి 'మాయ' అనే అర్థం చెప్పారు. కూటమంటే కపటమని మిథ్యయనికూడా అర్థం. తప్పుడు సాక్ష్యం చెప్పినవాన్ని కూటసాక్షి అని అంటాం. భ్రాంతిరూపమైంది కాబట్టి మాయను కూటస్థమనొచ్చునని వారు నిర్వచించారు. కానీ మొదట చెప్పిన అర్థమే చాలా రూఢిలోది.

"అచలం" అనేది ఆరోవిశేషణం. చలనము లేనిదని అర్థం. పరబ్రహ్మము తాను చలింపక చలించే నానాజగత్తులకు ఆశ్రయమైవుంది. ఆకాశమువలె నిశ్చలమన్నమాట. నీవు నీ యింటినుండి ఒక చెంబును యిక్కడికి తెచ్చావు. చెంబునే తెచ్చావుగాని, చెంబులోని ఆకాశాన్ని తెచ్చావా? ఆకాశము తెచ్చేదికాదు; యిచ్చేదికాదు. అది ఒకచోట లేకుంటేగా - తెచ్చేది - యిచ్చేదీని. శరీరాలు -లోకాలు ఎంతెంత పరిభ్రమించినా - ఆత్మకు పరిభ్రమణం లేదు. అది అచలం.

"ధ్రువం" — అనగా నిర్వికారమని అర్థం. ప్రపంచం ఆరు వికారాలతో కూడింది. పుట్టుట — వుండుట — పెరుగుట — పరిణామము చెందుట - క్షీణించుట - నశించుట, ఇవే ఆరు వికారాలు. ఈ షడ్వికారాలకు సాక్షియై ఆ పరమాత్మ నిర్వికారమైవుంది. కాబట్టి దాన్ని ధ్రువమన్నారు.

అక్షరరూప పరమాత్మకు యీవిధంగా యేడు విశేషణాలు చెప్పబడ్డవి. ఈ లక్షణాలను అనుసంధానం చేస్తున్నాచాలు. బ్రహ్మ

ముహూర్తంలో లేచి సవిత్రాంతఃకరణంతో పరమాత్మస్వరూపాన్ని - ఆత్మస్వరూపాన్ని పైని చెప్పినవిధంగా అనుసంధానం చేస్తే కర్మరాశి అంతా దగ్ధమైపోతుంది.

శ్రీకృష్ణుడు చెబుతూన్నాడు. అట్టి అక్షరతత్త్వాన్ని పర్యుపాసన చేయాలి. ఇచ్చట "ఉపాసన" అని మాత్రం చెప్పలేదు. పర్యుపాసన అన్నాడు. ఉపాసన సగుణానికి సంబంధించింది. సగుణోపాసనలో ధ్యాత వేరు; ధ్యేయవస్తువు వేరు. నిర్గుణోపాసనలో ఆ భేదంలేదు. ఆ విషయాన్ని సూచించేకోసం "పర్యుపాసనా" శబ్దం వాడబడింది. నిర్గుణోపాసనంటే జ్ఞానమార్గమన్నమాట.

ఆవిధంగా అక్షరోపాసన చేసేవారు - అపరోక్ష దృష్టితో పరమాత్మే నా ఆత్మయని అనుసంధానం చేసేవారు పొందే ప్రయోజన మేమిటి? "తే ప్రాప్నువంతి మామేవ" - వారు నన్నే పొందగల్గుదురని భగవంతుడే చెప్పాడు. అస్మత్పదలక్ష్యార్థమైన పరమాత్మను వారు పొంద గల్గుతారు. పరమాత్మప్రాప్తి వారికి కల్గుతుంది.

ప్రాప్తి రెండు విధాలు. లేనివస్తువును సంపాదించుకొనుట ఒక విధం. ఈ పుస్తకము నావద్దలేదు. కంపెనీకి వ్రాశాను. వచ్చింది. అదొక్క విధమైనప్రాప్తి. దీని అప్రాప్తరూపప్రాప్తి అంటారు. మరో విధమైన ప్రాప్తివుంది. అసలు - వస్తువు నాదగ్గరే వుండింది. నేను మరిచాను. లేదనుకొన్నాను. ఆ వస్తువు కావాలని పరితపించాను. అంతలో ఒకమిత్రుడు నా కడకు వచ్చాడు. నా విషయాన్ని విన్నాడు. "అరే! వస్తువు నీవద్దనే వుందే. అదో!" అంటూ నాకు జ్ఞప్తికితెచ్చాడు. వస్తువు అసలు నావద్దనే వుండింది. తర్వాత, జ్ఞప్తికి తెచ్చుకోడం మాత్రమే జరిగింది. దీన్ని ప్రాప్తప్రాప్తి అంటారు. కంఠచామీకరన్యాయమంటారు. దీన్నే దశమదృష్టాంతమనికూడా అంటారు.

ఒక గ్రామంలో ఒక కుటుంబంవుండేది. సతీపతు లిద్దరూ - వారి కొక ఆడుబిడ్డ వుండేది. ఆ బాలికకు ఏడు ఎన్మిదేండ్ల యీడు. ఆ కుమార్తెను వారెంతో అల్లారుముద్దుగా పెంచుకొనేవాళ్లు. అమ్మాయిమెడలో ఒక బంగారు గొలుసు చేయించివేశారు. ఆ బిడ్డ దండను వదిలి ఒక్క-

గడియకూడా వుండేదికాదు. హమేశా మెడలో ధరించవలసిందే. ఒకసారి పొరిగింటికి విందుకు పోవలసివచ్చింది. తలిదండ్రులు సిద్ధమై కూతురిని సిద్ధంకమ్మన్నారు. ఆదరబాదర ముఖశుద్ధిచేసుకొని ఆ బాలిక మెడలోని దండను తడిమి చూచుకొంది. తొందరలో చేతికి చిక్కలేదు. కంగారుపడి దండ ఎక్కడో జారిపోయిందని బెంగతో ఏడుస్తూ కూచుంది. తల్లివచ్చి అడుగ్గా దండ ఎక్కడోపోయిందంటూ ఏడ్చుతూ చెప్పింది. ఆ దండ తల్లికి నేరుగా అగపడ్తూనేవుంది. "పిచ్చిదానా! ఇదుగో - నీదండ మెడలోనే వుందే" అని చూపించింది. ఆ పిల్ల దండ దొరికింది దొరికిందంటూ ఆహ్లాదపడింది. అసలు మొదట పోయివుంటే గదా - దొరకడం. దీన్నే శాస్త్రాల్లో ప్రాప్తరూపప్రాప్తి అంటారు.

భగవత్ప్రాప్తికూడా అలాంటిదే. భగవంతుని సంపాదించేకోసం దేశవిదేశాలకు — లోకలోకాంతరాలకు పోవలసిన పనిలేదు. అర్జునుడు శ్రీకృష్ణుని ఒకచోట అడిగాడు. "అయ్యా! కృష్ణా! చీటికిమాటికి యీశ్వరుడు యీశ్వరుడనిచెప్తూంటావే! ఆయన ఎక్కడుంటాడో కాస్తచెప్పు. ఆయనకు హెడ్ క్వార్టర్సు ఏది? ప్రధాన కార్యాలయమేదో — దాని అడ్రెసు వ్రాసియిస్తావా?" — అర్జునుని ప్రశ్నకు శ్రీ కృష్ణుడు యేమని చెప్పాడు? ఈశ్వరుడు కాశీలో వున్నాడని, రామేశ్వరంలో వున్నాడని, తిరుపతిలో వున్నాడని, శ్రీరంగంలో వున్నాడని చెప్పలేదు. మక్కాలో వున్నాడని - మదీనాలో వున్నాడని, ఆఫ్ఘాన్‌లో వున్నాడని, ఆకాశంలో వున్నాడని చెప్పలేదు. మరి యేమని చెప్పాడు? "ఈశ్వరస్సర్వభూతానాం — హృద్దేశేఽర్జున! తిష్ఠతి" — ఈశ్వరుడు సమస్తభూతాల హృదయాలల్లోవున్నాడు. ఆయన ప్రతివానికి ఆత్మస్వరూపమయ్యే వున్నాడు. కానైతే-భగవత్ప్రాప్తికోసం ఎక్కడపోవాలి? అజ్ఞానం తొలిగితేచాలు. అంతటావున్నాడు.

ఇక మనము అసలువిషయానికి వస్తాం. ఇది నిర్గుణోపాసనను గూర్చిన ప్రసంగం. నిర్గుణ తత్త్వమెట్టిదో వివరిస్తూ యేడు విశేషణాలు చెప్పుకొన్నాం. ఆ నిర్గుణోపాసన మహాకష్టమైందంటూ భగవంతుడు చెప్పబోతూన్నాడు.

"అర్జునా! అవ్యక్తమూ – అక్షరమూనైన నిర్గుణతత్త్వాన్ని వుపాసించేవారికి కష్టం మరింతా హెచ్చు. దేహాత్మబుద్ధిగల సామాన్య మానవులకు యీ నిర్గుణోపాసన అసాధ్యమైంది".

నిర్గుణోపాసన అమితఫలాన్ని యివ్వగల్గేదేకాని, ఇది యెమురీత వంటిది. దీనికి అధికారులు మిక్కిలి అరుదు. అందరికీ యిది అందుబాటు కాదు. ఇంద్రియాలకు గోచరించదు గాబట్టి దాన్ని అవ్యక్తమన్నారు. అగోచరమైనదాన్ని అవగాహన చేసుకోవాలంటే ఎంతప్రయాసో చెప్పనే పనిలేదు. కాబట్టే శ్రీకృష్ణుడు అధికక్లేశమనిమాత్రం చెప్పక అధికతర క్లేశమన్నాడు.

జపమూ ధ్యానమూ చేయాలంటేనే మనకు కష్టం. మనమనస్సు అవలక్షణాలకు పుట్ట. శతపుటాలువేసినా దాని చేదు చావదు. శ్రవణం చేస్తూంటే నిద్రొస్తుంది. చీట్లపేక తెల్లవార్లు ఆడినా కంటిపై కూర్కు రాదు. ఏమిటీతమాషా! ఎక్కడుంది కీలకం. ఇదంతా మనస్సుచేసే తిప్ప లాటకం. సామాన్యమైన సగుణోపాసనలోనే యీగతిగావుంటే నిర్గుణో పాసనమాట చెప్పేదేమిటి?

దేహాత్మబుద్ధిలేని మహనీయులకు అవ్యక్తోపాసన సులువేగాని, దేహాభిమానవంతులకుమాత్రం అలవికాదు. దేహాభిమానాన్ని వదలుటే నిజమైన సంన్యాసం.

శ్రీకృష్ణభగవంతుడు యీవిధంగా "యే త్వక్షరమనిర్దేశ్యం"– అనే శ్లోకం మొదలిడి "దేహవద్భిరవాప్యతే" – అనువరకు మూడు శ్లోకాలతో నిర్గుణోపాసనయొక్క ప్రకారప్రభావప్రయోజనాలను చెప్పి యిక విస్తారంగా సగుణోపాసకులయొక్క పద్ధతిప్రకారాలను బోధిస్తూ న్నాడు.

— తృతీయ విశ్రాంతి —

మకాం - బంగారుపేట.

ప్రియమైన ఆత్మబంధువులారా!

ఉప్పుబొమ్మను సముద్రంలోకి వదలి దాని లోతు పాతు తెలిసి కొనిరమ్మని చెప్పిపంపితే, అది వాపసువచ్చి మనకు జవాబుచెప్తుందా? సముద్రంలోనికి పోయిన ఉప్పుబొమ్మ సముద్రమే అయిపోతుంది. ఆలాగే బ్రహ్మవిచారాన్ని చేస్తూ మనంకూడా బ్రహ్మస్వరూపులమే అయిపోవాలి. ఆ సిద్ధిని పొందేకోసమయ్యే యీ మనుష్యజన్మం మనకు కల్గింది.

"దుర్లభం త్రయమేవైతత్ – దైవానుగ్రహకారకం।
మనుష్యత్వం ముముక్షుత్వం – మహాపురుషసంశ్రయః॥"

అని శ్రీమచ్ఛంకరులవారు తమ వివేకచూడామణిలో చెప్పినారు. అసలే మనుష్యుడై పుట్టుట అపరూపం."జంతూనాం నరజన్మ దుర్లభం" అనేక జన్మార్జిత పూర్వపుణ్యాభాగ్యంతోనే మానవజన్మ లభిస్తుంది. అందులో మోక్షేచ్ఛ కల్గుట మరీకష్టం. సత్పురుషుల సాంగత్యం దొరకుట మరింతా కష్టం. ఈ మూడూ లభించాయా, నిజానికి అది భగవంతుని అపారకృపాఫలంగానే భావించాలి.

మన శాస్త్రాలల్లో మానవున్ని "వ్యక్తి" అని చెప్పడం కద్దు. ఆమాటకు అర్థమేమి? మహర్షులు పెట్టినపేరు అర్థరహితంగా వుండదు. అవ్యక్తమై – మాయావరణంలో గూఢంగావున్న ఆత్మతత్త్వాన్ని – పరమాత్మతత్త్వాన్ని వ్యక్తంచేసుకొనే – సాక్షాత్కారంపొందే యోగ్యత కలవాడు కాబట్టి మానవునికి వ్యక్తి అనేపేరు సిద్ధించింది. ఆత్మసాక్షాత్కారమే మానవజన్మానికి విశిష్టత. ముక్తిని – ఆత్మజ్ఞానాన్ని పొందే హక్కు ఒక్క మానవజన్మకు తప్పితే చివరికి దేవతాజన్మాలకు కూడా లేదు. దేవజన్మలలో విచ్చలవిడి విషయభోగాల ననుభవించొచ్చు. ముక్తి మాత్రం సున్న. ముక్తి కావాలంటే మనుష్యజన్మానికి వచ్చితీరాల్సిందే. నీవు బంగారుపేటలో వ్యాపారంచేసి వెయ్యిరూపాయలు సంపాదించి జేబులోపెట్టుకొని మద్రాసుపోతావు. ఆ వెయ్యిరూపాయలు ముగిసేవరకూ మద్రాసంతా నీదే. బస్సులు – ట్రాములు – సినిమాలు – హోటళ్ళు, అంతటా నీదేరాజ్యం. వెయ్యిరూపాయలు ముగుస్తూనే హోటళ్లలో ఒక

కప్పుకాఫీ చచ్చి గీపెట్టినా యివ్వరు. మళ్ళీ డబ్బుకోసం బంగారుపేటకు రావలసిందే. దేవలోకాల గతికూడా అంతే. మనుష్యజన్మంలో దానాలు, ధర్మాలు, యజ్ఞాలు, యాగాలు యిష్టాపూర్తాది సత్కార్యాలు చేసి పుణ్యాన్ని మూటగట్టుకొని స్వర్గలోకం పోవచ్చు. అచ్చట అమృతపానం — అప్సరోపభోగం — నందనవన విహారం, కోకొల్లలుగ అనుభవించొచ్చు. ఎంతవరకు? పుణ్యం ముగిసేవరకే. తర్వాతనో! "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" — మళ్ళీ మన బంగారుపేటే గతి.

మానవజన్మానికి కల్గినవిలువ జ్ఞానంతోనే అని గ్రహించాలి. ఆ జ్ఞానం శూన్యమైతే, "జ్ఞానేన హీనః పశుభిస్సమానః" — జ్ఞానహీనుడు పశువుతో సమానుడని నీతిశాస్త్రకారుడు చెప్పాడు. పశువుతో సమానుడుకాడు; నిజమడిగితే — పశువుకంటే తక్కువనే చెప్పాలి. ఒక విషయం చెప్తా వినండి. ఓ వేటకాడు అడవిలో కుందేటిని చంపుకొని బజారుకు తెస్తాడు. మాంసాహారులైన జనులు ఆ చచ్చిన కుందేలును ఎంతకిస్తా వెంతకిస్తావంటూ బేరం చేస్తారు. కాలంతీరి ఒక మహారాజు చచ్చాడనుకోండి; ఒక పీఠాధిపతి చచ్చాడనుకోండి. ఎంతకిస్తారని అడిగే దిక్కుండదు. ఆపీడ తొందరగా వూరిబైటికి సాగిపోతే అంతేచాలను కొంటారు. చూచారా! వెధవ కుందేలుకుండే విలువ మనుష్యునికి లేకపోయిందే! గీతోపన్యాసం వినేకోసం నీవు యింటినుండి చెప్పులు వేసుకొని యిక్కడికొచ్చావు. బయటవదిల్తే ఎవడైనా కాజేస్తాడనే భయంతో ప్రక్కయింటికిపోయి "ఉపన్యాసం ముగిసేవరకూ యీ చెప్పులను మీ యింటిలో పెట్టుకోండి. మళ్ళీవచ్చి వేసుకొనిపోతా"నని చెప్పి పెట్టివస్తావు. మాటకు అనుకో!! ఒక పెద్ద సాహుకారు చచ్చాడు. సాహుకారైతే మాత్రం చావు తప్పించుకొంటాడా? ఆ శవాన్ని శ్మశానానికి తీసుకొని పోతూన్నారు. మధ్యలో వాన తగుల్కొంది. "వాన వెలిసేవరకూ మీయింటిలో పెట్టుకోండి" అని అడిగితే ఎవరైనా పెట్టుకోనిస్తారా? — ఇదేం అన్యాయం. పెద్దసాహుకారు — మరి చెప్పులకంటె తక్కువా!

ఏమైనా చెప్పండి — మొత్తానికి "జగతిలో మానవజన్మంబు దొరకదు" — అని మహాపురుషులు గర్జించి చెబుతూన్నారు. "ఉత్తమ

జన్మమురా” అని హరిదాసులు ఉల్లాసంగా పాడుతున్నారు. ఆ గొప్పతనం దేంతో వచ్చింది? ధనంతోకాదు; బలంతోకాదు; రూపంతోకాదు; ప్రతాపంతోకాదు. జ్ఞానంతో — ఆత్మజ్ఞానంతో. జ్ఞానంకల్గి ప్రయత్నిస్తే నరుడు నారాయణుడై తాడు; మానవుడు మాధవుడై తాడు; జీవుడు శివుడై తాడు; జనుడు జనార్దనుడై తాడు. ఇంతకూ ప్రయత్నిస్తేగా —

సృష్టికి ప్రతిసృష్టిచేసిన విశ్వామిత్రుని శక్తి నీలోవుంది. భగవంతున్ని స్తంభంనుండి బైటికి తీసిన ప్రహ్లాదుని శక్తి నీలోవుంది. ఆరునెలల్లో ధ్రువపదాన్ని సాధించిన ధ్రువబాలకునిశక్తి నీలోవుంది. మానవుడా! ఉద్ధరేదాత్మనాత్మానం.

భగవద్గీత — పండ్రెండో అధ్యాయం—భక్తియోగం — మనప్రస్తుత విషయం. ఆరోశ్లోకంనుండి యిప్పుడు విమర్శించుకోవాలి.

నిర్గుణభక్తి దేహాభిమానం కలవారికి పొసగనేపొసగదు. సర్వ సమర్పణం చేసిన అర్జునునిలాంటి శరణాగత భక్తులకే అది శక్యం కావొచ్చు. అర్జునుడు యిహాముత్రఫలభోగాలపై ఆశవదలి “త్వమేవ శరణం మమ” అని అనన్యచిత్తంతో శరణుబొందాడు. “మమ” వదలుటే నమస్కారం. ఇట్టి కేవలనిష్ఠను ఎంతమంది పొందగల్గుతారు? కాబట్టే సగుణభక్తి సర్వానుకూలమంటూ భగవంతుడాదేశించాడు.

హిమాలయ పర్వతాన్ని ఎక్కడమంటే సులభసాధ్యమైన పనిగాదు. మొన్న మొన్న యెవ్వడో యెక్కాడంటూ ప్రపంచమంతా అబ్బురంగా చెప్పుకొంది. తిరుపతికొండ విషయమలాకాదు. ఇది సాధారణంగా సర్వ సులభమైన కార్యం. అట్లే నిర్గుణ సగుణోపాసనల తారతమ్యంకూడా.

సగుణోపాసన కానీగాక! చేయాలనే సద్బుద్ధి కలేదెందరికి? మనమూ నిరంతరం ఉపాసనచేస్తూనేవున్నాం. పుత్రోపాసన — కళత్రోపాసన, గేహోపాసన — దేహోపాసన, విత్తోపాసన — క్షేత్రోపాసన మనంచేసే వుపాసనలు. కాని కేవలం యీశ్వరోపాసన చేసేవారు ఏ నూటికొకడో — కోటికొకడో! కాబట్టి సగుణోపాసనంటే అంత చులకనగా చూడపనిలేదు.

సగుణోపాసన సాధన — నిర్గుణోపాసన సాధ్యం. ఎప్పటికైనా నిర్గుణోపాసనను ఆశ్రయిస్తేనే ముక్తుడు కాగల్గేది. ప్రస్తుతం సగుణోపాసకుడైన భక్తుని పద్ధతిప్రకారాలను చెబుతూన్నారు.

“అర్జునా! సమస్తకర్మలను భగవంతుడనైన నాయందు వదలి, అనన్యయోగంతో భగవంతుడనైన నన్నే ధ్యానిస్తూ — ఉపాసిస్తూ వుండేవారిని త్వరగా సంసారసముద్రమునుండి ఉద్ధరిస్తాను. వారికేభయమూ లేదు.”

భగవంతుడు భక్తులకు హామీయిచ్చాడు. ఎంతటి ప్రేమపూర్వకమైనమాట! సమస్తకర్మలను నాకు సమర్పించమని భగవంతుడు చెబుతూన్నాడు. వ్యాపారం — వ్యవహారం, పనీ — పాట ఏమి చేస్తూన్నా, నేనుచేస్తూన్నాననే కర్తృత్వాహంకారాన్ని వదలి యీశ్వరునికి సమర్పించాలి. దానివలన అంతఃకరణశుద్ధి కల్గుతుంది. కర్మలను భగవంతునిలో వదలుట అంటే, బావిలోకి బిందెను వదలినట్లని, పెట్టెలోనికి వస్తువులను వదలినట్లని ఊహించరాదు. కర్తృత్వాభిమానాన్ని వదలి, ఫలాపేక్షను వదలి కర్మలుచేస్తే వాటిని భగవంతునిలో వదలినట్లే. సర్వకర్త భగవంతుడైనపుడు మధ్యలో తన పెత్తనమెందుకని?

అర్జునుడు విశ్వరూపాన్ని దర్శించాడు. విశ్వమంతా సూదిమొనంత వెలితిలేకుండా విశ్వేశ్వర పరమాత్ముడు నిండివున్నాడు. ప్రయాసపడి విశ్వమును విశ్వేశ్వరుడుగా తయారుచేయవలసిన పనిలేదు. జ్ఞానదృష్టి కల్గితేచాలు. ఏమీ చేసేదీలేదు; చెరిచేదీలేదు. అజ్ఞానదృష్టికి ప్రపంచ దర్శనం; జ్ఞానదృష్టికి పరమాత్మ దర్శనం. దృష్టి మార్చుకొంటే దర్శనమూ మారుతుంది. బైటదేన్నీ మార్చేదీలేదు; తీర్చేదీలేదు. మార్చేటందుకు - తీర్చేటందుకు మనతో ఏమౌతుంది? “దృష్టిం జ్ఞానమయీం కృత్వా - పశ్యేద్బ్రహ్మమయం జగత్” — దృష్టిని జ్ఞానమయంచేసికొని చూస్తే జగత్తు బ్రహ్మమయమైవుందని శ్రీ శంకరులవా రానతిచ్చారు. దృష్టి అంటే యిక్కడ అంతఃకరణవృత్తి అని అర్థం చేసుకోవాలి.

ఒక గ్రామంలో ఒక ధనవంతుడుండేవాడు. ఆయన కోటీశ్వరుడు. ఏ దుష్కర్మవల్లనో ఆయనకొక పెద్దరోగం తటస్థించింది.

నానాటికి క్షీణిస్తున్నాడు. మందులు మాకులు - డాక్టర్లు వైద్యులు, కావలసిన కర్మకాండలూ ముగిసింది. రానురాను ఆతనికి జీవితంపై నిస్పృహే కల్గిపోయింది. కాలమెట్లో వేగిస్తున్నాడు. ఒకనాడు మహా నీయుడైన ఒకసాధువు క్షేత్రయాత్రచేస్తూ మార్గమధ్యంలో ఆ గ్రామా నికి వచ్చాడు.

"భవతి భిక్షాం దేహి" అనిపల్కి నిల్చున్న సాధువుగారి వర్చస్సు సావుకారును అమాంతం ఆకర్షించింది. ధనికుడు తన స్థితి_గతి ఆయ నకు నివేదించాడు. "అయ్యా! నీ రోగం తీరా నయమయ్యేదికాదు. కాని ఉపచారంగా ఒక ఉపాయం చేయొచ్చు. నీవెప్పుడూ ఆకుపచ్చ రంగే చూస్తుండాలి. ఇతరరంగులు చూపుల్లో పడనీవద్దు. తక్కిన రంగులను చూస్తుంటే నీ రోగానికి సేగి (దోహదం). ఈ పద్ధతి పెట్టు కొన్నావా — రోగం పెరిగిపోదు. వున్నంతలో వుంటుంది. కొంత ఉప శాంతి పొందగల్గుతా" వని సాధువుగారు చెప్పివెళ్లారు.

ధనవంతుడు వెంటనే బొంబాయికి ఆర్డరిచ్చి ఒక న్యాగను పచ్చ రంగుడబ్బాలు తెప్పించాడు. పదిమంది కూలీలకు క్రొత్త ఉద్యోగ మొకటి దొరికింది. సావుకారు ఎక్కడపోతూన్నా, రంగుడబ్బాలు కుంచెలు చేతబట్టి ఈ కూలీలు ముందుముందు రంగుపూస్తూ పోతూంటారు. గోడ లకు - కొమ్మలకు, యిండ్లకు - బండ్లకు, పూశారు - అలికారు. యజ మాని వేరేరంగు చూడరాదుగదామరి! ఇదొక్కబారీ ఉద్యమమై పోయింది. గ్రామమంతా ఆకుపచ్చరంగుతో తాండవమాడిపోతూంది.

కాలచక్రంలో ఒక్క ఆకు తిరిగింది. సంవత్సరం మారి క్రొత్త క్యాలెండరు వచ్చింది. ఆనాటి సాధువుగారు తిరుగుప్రయాణంలోనేమో! ఆగ్రామానికే విచ్చేశారు. రంగుడబ్బాలు చేతబట్టుకొని వీధుల్లో దిరిగే యీ మూకను చూచాడు. అతని ఆశ్చర్యానికి అంతులేదు. "ఏమం డోయ్! ఏమిటీ గోల?" అని కూలీల నడిగాడు. "స్వామీజీ! ఇది మీ ప్రతాపమే. పచ్చరంగే చూడాలని మా సావుకారికి చెప్పారు బాబోయ్! ఇక చూడండి తడాఖా. మొత్తం ప్రపంచాన్నే పచ్చగా చేయాలని ఆయన పంతం పట్టాడు." అని కూలీవాండ్లు సమాధానం చెప్పారు.

ఇంటికి వచ్చిన సాధువుగారికి ధనికుడు రాజసత్కారం నడిపాడు. “మహానుభావా! తాముచెప్పిన క్రియ మంత్రంలాగా పనిచేసింది. రోగ పీడ ఉపశాంతి బొందింది. కానైతే, వ్యాసంగం పెద్దది. ఫరవాలేదు లెండి” — ధనవంతుడు వినయపూర్వకంగా మనవిచేసుకొన్నాడు.

“ప్రపంచానికి పచ్చరంగు వేయాలనే అవివేక మెందుకయ్యా! బెంగుళూరువెళ్లి పదిరూపాయలిచ్చి పచ్చరంగు సులోచనాలు తెచ్చుకొంటే తంటాలీరేదిగదా! ఈ లేనిపోని బెడదఅంతా ఎందుకు?” — సాధుగారు చెప్పి ఫక్కున నవ్వారు.

“దృష్టిం జ్ఞానమయీం కృత్వా-పశ్యేద్‌బ్రహ్మమయం జగత్”- అధిష్ఠానవస్తువును చూచేది జ్ఞానదృష్టి. కల్పితనామరూపాలను చూచేది అజ్ఞానదృష్టి. కుండను చూచుట అజ్ఞానదృష్టి. మట్టిని చూచుట జ్ఞాన దృష్టి. కుండ ఇంతకుముందు లేదు. రాబోయే కాలానికి వుండదు. కనబడే మధ్యకాలంలో మాత్రం - కుండ ఉందంటారా? నిజంగా మట్టే వుండేది. మట్టిని అమాంతం మినహాయిస్తే కుండకు అస్తిత్వంలేదు. మట్టి త్రికాలాల్లోనూ వుంది. అది నిత్యవస్తువు.

బ్రహ్మవస్తువు మూడుకాలాల్లోనూ వుంది. ప్రపంచము అజ్ఞానావస్థలోమాత్రము గోచరించేది. జ్ఞానావస్థలో సర్వత్ర పరబ్రహ్మమే.

విశ్వరూపాన్ని దర్శించిన అర్జునుడు యుద్ధానికి తాను కర్తననే అభిమానాన్ని పరిత్యజించాడు. తాను చంపకముందే సర్వసైన్యాలు నశించిపోతూన్నాయి. అంతా భగవంతుడే నెరవేర్చి తన్ను కీర్తికి పాత్రుని చేస్తూన్నాడు. అది ఆతని భక్తవాత్సల్యం. వహవ్వా! తాను నిమిత్త మాత్రం. జగన్నాటక రంగంలో భగవంతుడు సూత్రధారి; తాను పాత్ర ధారి, నేను చేస్తూన్నాననే అతిప్రసంగం తనకెందుకని? భగవంతుడు తానుచేసే ధర్మసంస్థాపనకార్యంలో నన్ను నిమిత్తమాత్రంగా గ్రహిస్తూన్నాడా? అహోభాగ్యం. ఈ వుపాధికి అంత సౌభాగ్యముందా? బాల గోపాలుని చేతిలో మురళి కాకుంటే మానె. చివరికి ఆతని కాలిచెప్పై వున్నాచాలు. కానైతే, ఆచెప్పు కొరికే చెప్పై వుండరాదు; కరిచే చెప్పై వుండరాదు. అహంకార మమకారాలు - కర్తృత్వభోక్తృత్వాలు, వాసనకు లేకుండా నశించి, మెత్తని - సుతిమెత్తని చెప్పైవుండాలి.

అర్జునుడు మోహనాతరంగాలల్లో వూగిపోతూన్నాడు. ఆతనిలో కర్తృత్వాభిమానం నశించింది. భగవంతునిచేతిలో పనిముట్టు తాను.

శ్రీకృష్ణుని ప్రియురాలు రాధాదేవి ఒకరోజు తలపోసిందట. "ఈ పిల్లనగ్రోవి ఏ పుణ్యం చేసుకొందో! కృష్ణుడు దాన్ని వదలనేవదలడు. నేను సహా కాస్తకాస్త దూరంలోనేవుంటాను. కృష్ణుని సన్నిహితసంబంధం నాకంటే దానికెక్కువ. పెదవులపై ఆడుతుంది; చేతుల్లో కులుకుతుంది. బొడ్డున నిద్రపోతుంది. సెభాష్! ఎంత నిత్యానపాయిత్వం. వీలైనపుడు దానినైనం అడిగి తెలుసుకొంటా."

ఒకరోజు మురళిని కవంతదూరంగాపెట్టి జగన్నాటక సూత్రధారి నిద్రపోతూన్నాడు. నిద్రబోయినట్లు నటిస్తూన్నాడు. నిద్రకుసాక్షియైనవానికి నిద్రెక్కడిది? ఆయన నిద్రబోతే లోకానికి దీర్ఘనిద్రేగతి. రాధాదేవికి అవకాశం దొరికింది. "అమ్మా! మురళీ! నమస్కారం. నీపై కృష్ణునికింత మక్కు ఏలాకల్గింది? ఏ పుణ్యంచేశావు? ఏ నోమునోచావు? నీ భాగ్యమే భాగ్యం. నీవీమహిమను ఎలాసంపాదించావు? తపమా? జపమా? మంత్రమా? తంత్రమా? మందా? మాకా? ఎక్కడిదీ వశీకరణవిద్య. తల్లీ! దాపరికం లేకుండా నీలో యే మహాత్తువుందో చెప్పు."

"అమ్మా! రాధామాతా! నీవేమేమో క్రొత్తక్రొత్త మాటలు చెబుతూన్నావు. మంత్ర తంత్రాలు — మందులు మాకులు, నాకా పెంకే తెలియదు. అసలు — నాలో ఏముందో నీవే చూచుకో" — పిల్లనగ్రోవి చెప్పిందట. ఏముంది? వట్టిలొట్ట; ఖాళీబోలు. ఏమైనావుంటే కృష్ణుడు చేతపట్టేవాడేనా? ఏమీలేకు కాబట్టే పట్టుకొన్నాడు. తాను భగవంతుని పట్టుకోడంకాదు గొప్ప. భగవంతుడు తన్నుపట్టుకొన్నాడు. ఇక్కడుంది తమాషా. తనపలుకు తనప్రాణం అంతాకృష్ణునిదే. తనదంటూ మురళికి ఒకటివుంటేనా?

మురళిలాగా సర్వసమర్పణంచేసి శూన్యంకావాలి. అహంకారమనే అపశ్రుతి పల్కరాదు. అప్పుడే కృష్ణుడు స్వీకరిస్తాడు. నిమిత్తమాత్రంగా వుపయోగిస్తాడు.

"యే తు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య"—సమస్తకర్మలను భగవంతుని యందు నివేదించి భక్తుడు నిశ్చింతుడు కావాలి. గొడ్డలి కట్టెలను కొట్టుతుందంటే, అది దాని సొంతశక్తేనా? అదొక్క ఉపకరణం మాత్రం. అంతమాత్రానికి దాని కహంకారమెందుకు?

అన్నికర్మలను భగవంతునిలో వదలుటమాత్రమే కాదు. పైపెచ్చు "మత్పరః" — మత్పరుడు కావాలని శ్రీకృష్ణుడు చెబుతూన్నాడు. ఈ మాటలోని స్వారస్యమేమి? అన్నీ వదలొచ్చు. కానీ, వదిలేదాన్ని—వదిలాననేదాన్ని వదలడం కష్టం. అన్నీ త్యాగంచేసినా కూడా, నేను త్యాగంచేసినాననే అభిమానాన్ని — అహంకారాన్ని వదలక లాభంలేదు. ఆ సూక్ష్మాహంకారాన్ని సైతం పరిహరించుమనే సూచనతో 'మత్పరః' అనేమాట చెప్పబడింది. అట్టివాడు అనన్యయోగంతో భగవంతుని వుపాసిస్తాడు.

అనన్యయోగమంటే ఏమో విచారించుకొందాం. "అన్యాశ్రయాణాం త్యాగోఽనన్యతా" — అని నారదుడు తన భక్తిసూత్రాలల్లో చెప్పాడు. ముంచినా తేల్చినా భగవంతుడొక్కడే తనకు ఆశ్రయం; తక్కిన ఆశ్రయాలపై అపేక్షలేదు — ఇదే అనన్యత. మన పరిస్థితి ఏలా వుంది? ఆస్తిపాస్తి — యిండ్లు వాకిండ్లు — ధనధాన్యాలు, వుండజూచుకొని ఏదో గమ్మత్తుకు అంతటికి దేవుడున్నాడని మాటమాత్రమంటాం. మధ్యమధ్య వూరగాయ నంజుకొన్నట్లు, మనకు దేవుడూ భక్తికావాలి. దేవుని ఆశ్రయంతో బ్రతుకుతూన్నానని హృదయశుద్ధిగా చెప్పేవాడొక్కడూలేడు. "ఏమయ్యా! నీవు జీవించేటందుకు ఆశ్రయమేముంది?"— అని అడుగుదాం. భూములున్నాయని, నగదు ఆస్తీవుందని, బ్యాంకిలోని డబ్బుని, కొడుకు సంపాదించే జీతాన్ని, తనకువచ్చే పెన్షన్ అని, మిల్లులు — ఫ్యాక్టరీలున్నాయని, అపారంగా శిష్యుల బలగముందని, పది ఆశ్రమాలున్నాయని, నాల్గువిద్యలువచ్చునని చెప్పేవారేగాని, సత్యంగా — భగవంతుని ఆశ్రయంతో జీవిస్తూన్నాననే బుద్ధి ఎవ్వనికీలేదు. పోనీ, దేవునిఆశ్రయంలేకపోతే మానవుడు ఏటితో నే బ్రతుకుతాడా? "మనుష్యుడు రొట్టెవలనకాదు బ్రతికేది. దేవునిమాటవలన" — అని ఏసుక్రీస్తుచెప్పాడు.

"మర్త్యుడు ప్రాణాపానములవలన జీవించుటలేదు. ప్రాణానికి ప్రాణమైన పరమాత్మసిద్వారా జీవిస్తూన్నా"డని కఠోపనిషత్తు తెగజెప్పింది. కానీ— అదేమికర్మమో — అవిశ్వాసి అల్పవిశ్వాసియైన మానవునికి ఆపాటి పరిజ్ఞానం లేదు.

నారదుడు చెప్పినభావం భక్తిపంథాలోది. భగవంతుడు తనకు అన్యంగా లేడు. తనస్వరూపమే భగవత్స్వరూపం. భగవత్స్వరూపమే తనస్వరూపం. ఇది జ్ఞానపంథా. భక్తి చివరికి జ్ఞానంగా పరిణమిస్తుంది. సగుణభక్తి సిద్ధిస్తే నిర్గుణభక్తి కల్గేటందుకు యెడముండదు.

సర్వకర్మములను భగవంతునికి సమర్పించి అతడే పరమగతియని నమ్మి వుపాసించువారికి పరమేశ్వరుడు హామీ యిస్తూన్నాడు. శ్రీకృష్ణుని పూచీకత్తుతో తప్పక వారు సంసార సముద్రాన్ని తరిస్తారు. సమర్థుడైన కెప్టెన్ — భగవంతుడే వారికి దొరికాడు. వారిభాగ్యం పండింది. మృత్యుసంసారసముద్ర మెంతెంత అల్లోల కల్లోలాలతో కలగుండు పడనీగాక! వారికి దిగులులేదు. 'తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్' — శ్రీకృష్ణుడెంత తెంపుగా చెప్పాడో! ఈ లోకము 'అనిత్యమసుఖ'మైంది. ఇట్టి 'అశ్వత్థ'లోకంలో వుండీ భగవంతుని నమ్మినవానికి ముప్పులేదు.

నిర్గుణభక్తుల విషయంలో "తే ప్రాప్నువంతి మామేవ" — వారు నన్నే పొందగల్గుతారని శ్రీకృష్ణుడు చెప్పాడు. సగుణభక్తుల విషయంలో "తేషామహం సముద్ధర్తా"—వారిని నేనే వుద్ధరిస్తానంటాడు. ఈ రెంటిలో నిరపాయమైన మార్గమేది? మొదటివిధానాన్ని మర్కట కిశోరన్యాయమని, రెండోవిధానాన్ని మార్జాల కిశోరన్యాయమని పోల్చుకోవచ్చు. కోతిపిల్ల తనతల్లిని కరుచుకొనివుంటుంది. అప్పుడు — తల్లిబాధ్యత ఏమీ లేదు. కొమ్మలపై దూట్లువేసేటపుడు పట్టు వదలిందంటే పిల్ల అపాయానికి గురిఐతుంది. జవాబ్దారీఅంతా పిల్లదే. మరొక్కపద్ధతి. పిల్లి తనపిల్లలను తానేపట్టుకొని కావలసినచోటికి కొంపోతుంది. అక్కడ పిల్లజవాబ్దారీ ఏమీలేదు. ఈ రెంటిలో రెండవపద్ధతి నిరపాయమైంది; సునాయాసమైంది. సగుణభక్తుడు భగవంతుని ఆశ్రయంతో చల్లగా తన గమ్యాన్ని చేరుకొంటాడు.

— చతుర్థ విశ్రాంతి —



మకాం - బంగారుపేట.

ప్రియమైన ఆత్మబంధువులారా!

వినండి. భగవద్గీత — పన్రెండో అధ్యాయం — పేరు భక్తియోగం. ప్రస్తుతం 8-వ శ్లోకంనుండి విమర్శించుకోవాలి. భగవంతుడు చెబుతూ న్నాడు.

"ఓ అర్జునా! నీ మనోబుద్ధులను నాయందే వుంచు. తదుపరి శాశ్వతముగ నీవు నాయందే నివసిస్తావు."

ఈ దేహంనాది; ఈమనస్సునాది; ఈబుద్ధి నాది — అనే అభిమానం వుండేవరకూ భగవత్ ప్రాప్తి సున్న. స్థూలసూక్ష్మ శరీరాలపై అహంత్వ — మమత్వములనుంచుటే జ్ఞానానికి ముఖ్యమైన ప్రతిబంధం. "దేహాభి మానపాశేన — చిరం బద్ధోఽసి పుత్రక!" — దేహము నేను నాది అను కొనే అభిమానపాశంతో నాయనా! బహుకాలంనుండి బద్ధుడవై యున్నా"వని అష్టావక్రుడు జనకునితో చెప్పాడు. మహానుభావుడైన అష్టావక్రుని గాథను కొద్దిగా చెపుతాను.

జనకచక్రవర్తి అష్టావక్రుని వద్దకెళ్లి బ్రహ్మజ్ఞానాన్ని బోధించు మని సవినయంగా ప్రార్థించాడు. "నేను బ్రహ్మవిద్యను బోధిస్తాను. గురుదక్షిణగా ఏమిస్తావో చెప్పు"మని మునీశ్వరుడు నరేశ్వరుని ఎదురడి గాడు. జ్ఞానానికి సరితూగేవస్తువు తానేమిస్తాడు? తన వస్తువులన్నీ అని త్యాలు. ఆత్మవిద్య నిత్యమైంది. నిత్యవస్తువునకు బదులుగా అనిత్యవస్తువు లేమని యివ్వాలి? సమాధానం దొరకక జనకుడు మిన్నకుండినాడు. కాలం గడిచింది. ఒకనాడు వేటకు ఆయత్తమైపోతూ జనకమహారాజు తనగుర్రాన్ని ఎక్కబోతూన్నాడు. అష్టావక్రమహర్షి రాజును సమీపించి "మహారాజా! బ్రహ్మజ్ఞానం బహుదినాలనుండి అపేక్షిస్తూన్నావు. కాల మేమో గడిచిపోతూనేవుంది. నీ అపేక్షను పూర్తిజేసికో"—మని పలికాడు. "ఎంతకాలములో నాకు బ్రహ్మసాక్షాత్కారాన్ని కల్గిస్తారు?" అని రాజు గుర్రాన్ని ఎక్కబోతూ అడిగాడు. "రాజేంద్రా! ఒకకాలు అంకెన (రికాబు)లోపెట్టిన తర్వాత, రెండోకాలును రెండో అంకెనలోకి మార్చ

కొనేలోగా నీకు బ్రహ్మసాక్షాత్కారం కల్గిస్తాను"—అని మహర్షి ధీరాగా చెప్పేశాడు.

"అయితే గురుదక్షిణ యేమడుగుతారో అడగండి."

"నీ దేహాభిమానం నాకిచ్చివేయ్."

శిష్యుడేమి తక్కువవాడా? ముత్తెపుచిప్ప రెడీగావుంది. చినుకు పడడమే తరువాయి. జనకుడు గుర్రంపై నుండే బ్రహ్మసమాధి బొందాడు.

"దేహాభిమాన పాశేన — చిరం బద్ధోఽసి పుత్రక !

బోధోఽహం జ్ఞానఖడ్గేన — తన్నికృత్య సుఖీభవ!!"

దేహాభిమానాన్ని వదల్తే జీవుడు దేవుడే. ఘటాభిమానాన్ని వదలితే ఘటాకాశమే మహాకాశం.

కాబట్టే భగవంతుడు నీ మనోబుద్ధులను నాకు సమర్పించమని కోర్తున్నాడు. "ఉపాధులను కుండలను పగులకొట్టి హృదయమనే వెన్నను అపహరించావోయ్! కృష్ణా! ఎంతదొంగవయ్యా!" — అని గోపికలు ఒకప్పుడు తమ ప్రేమోద్గారాన్ని వెళ్లనాడారు. సగుణభక్తునికి దేహాభిమానం పనికిరాదు, "ఈశావాస్యమిదం సర్వం—యత్కించ జగత్యాం జగత్"—జగత్తులోని సమస్తవస్తువులు యీశ్వరునివి. నిజమలావుంటే ప్రతివస్తువుపైనా నాది — నాది అనే మమకారముద్ర ఎందుకువేయాలి? అది అనధికార చేష్టగాదా? మోక్షాన్ని సంపాదించేకోసం పరమేశ్వరుడు మనకు మనోబుద్ధులనిచ్చాడు. కాలము మీరిపోకముందే వాటి సహాయంతో మోక్షాన్ని సంపాదించి యీశ్వరునిసొత్తు యీశ్వరునికి అప్పగించాలి. అటు గాకపోతే యీశ్వరునికి ద్రోహులమైతాము. "భగవంతా! అంతానీవే" నంటూ చివరికి "నేనూ నీవే — నేనుకూడా నీవే" — అనేచోటికిచేరాలి. "దేవా! నీవే నీవే నీవే నంటూ నేనుకూడా నీవే అయ్యాను" — అని కబీరుదాసు చెప్పాడు.

మనస్సు భగవదర్పితమై అది ధన్యమైపోతుంది; కాని దానికా భాగ్యం వుంటేగా? మనస్సు కోతికంటె చపలం. ఈ సందర్భానికి తగినట్లు శ్రీశంకరులవారు శివానందలహరీ స్తోత్రంలో చెప్పిన శ్లోకం ఒకటుంది, దాని భావాన్ని చెబుతాను.

ఒకరోజు శ్రీశంకరాచార్యులవారు కాశీవిశ్వనాథుని దర్శనానికి వెళ్లారు. భక్తితో దర్శనంచేసుకొన్నారు. ఆయన హృదయంలో ఒక భావం స్ఫురించింది. "భగవంతా! విశ్వనాథా! నీ కష్టంచూచి భరింప లేకున్నాను. ఒకవుపకారం చేయాలని నాకు వూహాపొడమింది. ఎట్టుద్రిప్పీ భిక్షగాడివిగదా! వూరక అడిగితే బిచ్చం ఎవరుపెడ్తారు? నీకొక ఉపాయం చెబుతాను. నాదగ్గర వొక కోతివుంది. దాన్నినీకు 'ఫ్రీ'గా యిస్తాను. అది నీ వద్దవుంటే నీవృత్తికి సానుకూలంగా వుంటుంది. నాకొక తంటాతీర్తుంది." అని మనవిచేసుకొన్నాడు. ఏమిటాకోతి? మనస్సు. ఎంతటి స్వారస్యమైనభావం!

మనస్సు మహాగయ్యాళిది. దానికి నచ్చిన పనులేచేస్తుంది. మనం చెప్పినపనులకు అడ్డం తిరుగుతుంది. అది పక్కా షోకవాది. క్రాపుదువ్వుకొనేకోసం — కాలరు టై బిగించుకొనేకోసం — చీరలు సింగారించుకొనే కోసం — బూటుమాలిష్ చేసుకొనేకోసం, గడియలు గడియలు ఖర్చు పెట్టుంది. పట్టుమని పదినిమిషాలు ధ్యానంచేయమంటే, ఏమో కొంప మునిగినట్లు తపించిపోతుంది.

అదీగాక — యీనాడు లోకానికి ఒక ఫేషన్ అలవాటయింది. మాటకొస్తే — "తీరికలేదండీ — వురసత్తు లేదండీ" — ఇదో ఫ్యాషన్. ఏమండీ ఉపన్యాసానికి రాలేదే? అని అడిగితే "తీరికలేదండీ" — ఇదొక్క పదం దొరికింది. మరికొందరంటారు. "మీకేంతెలుసండీ? సంన్యాసులై పోతిరి. ఇల్లూవాకిలి — కొంపాగోడు, ఆలూబిడ్డా, గొడ్డుగోద, చేనూ చెట్టూ బోలెడు జంజాటకం. కట్టుకదలనిస్తేనా వచ్చేందుకు? అవివదిలితే గదా మీ దగ్గరికి వచ్చేది. మీవలె వుంటే మేమిక ఎట్లుందుమో?" సెభాష్! ఇదొక్క సాకు దొరికింది. పాపం! అవన్నీ వీన్నిగట్టిగా పట్టు కొన్నట్టు — తనకేమో రావాలనే భ్రమేవున్నట్టు, ఛా — ఛా. పచ్చిమోసం. నిజమడిగితే — "అయ్యా! నీవు వాటిని పట్టుకొన్నావా? అవి నిన్ను పట్టు కొన్నాయా? అన్నెంపున్నెమెరుగని వాటిపై ఎందుకీ అభాండం. నీవు పట్టుకొన్న పట్టు వదలు. ఏవోపట్టుకొన్నట్లు ఎందు కేడుస్తావ్?"

ఒక ఎరుకలవాడు కోతినిపట్టేకోసం అవివుండే జాగాకు పోయాడు. తనవెంట ఒక కడవను తీసుకెళ్లాడు. ఆ కడవ ఎట్టిదంటే — దాని కడుపు

పెద్దది; మూతి చాలాచిన్నది. అలాంటి కడవను తీసుకెళ్లాడు. దాన్ని భూమిలో సగానికి పైగా బూడ్చాడు. కోతులు చూచేటట్లు రెండు శేర్లు వేరుశనగ పప్పులు అందులో పోశాడు. తాను ఒకచెట్టుచాటుకుపోయి కూర్చున్నాడు ఒక పెద్దకోతి వచ్చింది కడవలోకి చేయిపెట్టింది. ఆశలో మానవుని చెప్పిన తర్వాత కోతినే చెప్పాలి. ఆశ పాతకపు కోతి వేరుశనగ పప్పులను పిడికిటినిండా గట్టిగాపట్టింది. కడవమూతి చిన్నది కాబట్టి, బిగువైన పిడికిలి బైటికిరాలేదు. లోపలికి పెట్టేటపుడు వట్టిచేయి కాబట్టి సలీసుగా పోయింది. కానీ బైటికి తీసేటపుడు నిండుపిడికిలి కాబట్టి లోపలనే యిరుక్కొనింది. కోతి అమాంతం కంగారు పడిపోయింది. చపల చిత్తులకు తెలివి తక్కువగదా? లోపల ఎవడో తన చేతిని పట్టుకొన్నాడని అది అనుకొంది. దాని తెలివి పాడుగాను! తాను పట్టుకొన్న పట్టు వదిలితే తంటా తీరేది. గాభరాతో స్మృతి తప్పిన కోతిని ఎరుకలవాడు పట్టనే పట్టాడు.

మనోబుద్ధులను తనకర్పించమని భగవంతుడు చెప్పిన మాటను అర్జునుడు విన్నాడు. "అబ్బో! అంతగొప్పమాటే! అందరికీ అలవిగాదు గదా. కృష్ణా! దానికంటె సులువైన సాధన చెప్పరాదా?" — అని మనందరికోసం అడిగాడు. అర్జునుడు ప్రశ్నిస్తాడంటే — అది వ్యక్తిగతమైన ప్రశ్నగాదు. విశ్వమానవకోటి పక్షాన ప్రతినిధియై ఆయన అడుగుతూన్నాడు. శ్రీకృష్ణుడు యిక్కడినుండి ఒకదానికంటె ఒకటి సులువైన సాధనాలను వరుసగా చెబుతూన్నాడు.

"ధనంజయా! ఒక్కమ్మడి చిత్తాన్ని భగవదాయత్తం చేసే తాహత్తు నీకు లేకపోతే — పోనీ! హతాశుడవు కావొద్దు. అభ్యాస యోగాన్ని ఆశ్రయించు. నీకు సిద్ధి లభిస్తుంది."

చిత్తమన్నా మనస్సన్నా వస్తువు ఒకటే. మనోనిగ్రహమంటే చిన్నమాటకాదు. కోటికోటి జన్మాలనుండి అలవాటుపడి జీర్ణించిన సాంసారిక వాసనలను చప్పున వదలుమంటె ఏలావదిలేది? నేపాళ దేశస్థుడైన ఒక పండితుడు భగవద్గీతకు అంతరార్థం వ్రాశాడు. ఒకపద్ధతిలో అదీ బాగానేవుంది. ఆయన ఏమిచెబుతాడంటే —

సృష్టికి ముందు నిర్గుణనిరాకార పరమాత్మవుండినాడు. ఆయనకు మాయ అనే భార్యవుంది. ఆ భార్యాభర్తలకు మనస్సనే కుమారుడు పుట్టాడు. వాడు తల్లిచాలువాడు. తల్లికి అనుకూలుడై ప్రవర్తిస్తాడు. తండ్రిజాడకుపోడు. వానికి యిద్దరు భార్యలు ఒకతె ప్రవృత్తి-ఒకతె నివృత్తి. దుంపతేగా — ప్రవృత్తియందే వానికి మర్లు. నివృత్తిని చూచీచూడనట్లు. ప్రవృత్తిసంతానమే కౌరవులు. నివృత్తిసంతతి పాండవులు. ఒకటి ఆసురీ సంపద; మరొకటి దైవీసంపద. శరీరమనే ధర్మక్షేత్ర కురుక్షేత్రంలో యీ రెండు సేనలకు నిత్యపోరాటం హోరాహోరి జరుగుతూంది.

మనస్సుకు ప్రవృత్తియందే పక్షపాతం. ఎట్లో మచ్చికచేసి నివృత్తి తట్టు నెమ్మదిగా మళ్లించాలి. ఆత్రపాటు పనికిరాదు. "శనైః శనైః" — అని భగవద్గీత మెల్లగా తట్టితట్టి చెబ్తుంది. నీ యింటిలో ఒక ఆవు వుందనుకోండి. అది దొంగగొడ్డు. ఏమారి తలుగువిప్పితేసరి — చిక్కకుండా పరారి. పరాయివారి పొలాల్లోబడి మేస్తుంది. దాని వక్రమార్గాన్ని ఏలా వదిలించాలి? తలుగు విప్పకుండా అది పొలాలల్లో మేసేమేపుకంటె నాణ్యమైన మేపును యింటిలో దానికి సప్లయిచేయాలి. అటు చేసినా ఏమారితే దానివృత్తి అది మానదు. పట్టువదలక కొన్నాళ్లు ఆ విధంగా అలవాటు చేస్తే మొదటి అభ్యాసం క్రమంగా మరిచిపోతుంది. తర్వాత దారికి వస్తుంది.

మనమనస్సూ ఒక దొంగగొడ్డు. అదేమంటే - దొంగగడ్డిమేసే కోసం పోతుంది. అయినా ఫరవాలేదు. తొందర — త్రొక్కులాట పడరాదు. వైరాగ్యమనే తలుగు బిగించి అభ్యాసమనే మాంచి మేత వేయాలి. ఇందులో రుచిమరిగిందంటే మరి నెట్టినాపోదు. రుచి మరిగే టంతవరకే కష్టం. అంతవరకూ అభ్యాసం చేస్తూనే వుండాలి.

అభ్యాసంలోని శక్తి అపారమైంది. సర్కసులో ఏనుగు సైకిల్ త్రొక్కుతుంది. అది ఏ విద్య? అభ్యాసమే. అభ్యాసానికుండే ఆకర్షణ అయస్కాంతానికిలేదు; అభ్యాసబలంతో జీవుడు శివుడౌతాడు; మానవుడు మాధవుడౌతాడు. అభ్యాసప్రభావంతో ఎవరెస్టుశిఖరాన్నెక్కొచ్చు. హిందూసముద్రాన్ని యీదవచ్చు. హాలాహలాన్ని ఆరగించవచ్చు.

"సాధనమున పనులు సమకూరు." పక్షితీర్థంలో పైమును పక్షులు దిగివస్తాయంటే ఏమవుతుంటారు? అభ్యాసం.

"అభ్యాసయోగేన తతో—మామిచ్ఛాప్తుం ధనంజయ !" — అని శ్రీకృష్ణదేవుని అధికారవాణి.

శ్రీరామకృష్ణ పరమహంస దగ్గర ఒక శిష్యుడు వుండేవాడు. వానికి అఫీని (నల్లమందు) తినే పిచ్చిపట్టింది. అది మత్తుపదార్థం; మానుకొమ్మని అడపాదడపా గురువుగారు మందలించి చెప్పారు. వారు వీరంతా చెప్పారు. కానీ వాని యత్నంలో శక్యం కాలేదు. మహానుభావుడు పరమహంస ఒకరోజు శిష్యుని చెంతకు రమ్మన్నాడు. దాపున కూచోబెట్టుకొన్నాడు. "నాయనా! నీవు దినానికి ఎంత అఫీని తింటావు? ప్రమాణమెంత?" — అని అడిగాడు. "బేడఎత్తు" అని శిష్యుడు చెప్పాడు. బేడ (అడ్డగ) యెత్తుకు తగినట్లు బలపపు రాతిముక్కను త్రుంచియిచ్చి గురువిట్లన్నాడు. "నాయనా! ఇది సుతా యీ రాతి ఎత్తు తూచుకొని తింటూరా. ఈ బలపురాతిని పోగొట్టుకోవద్దు. ఇది గుర్వాజ్ఞ. అయితే ఒకపని చేయాలి. తూచుకొన్న తర్వాత బలపపు రాతిని దాచిపెట్టుకొనే సందర్భంలో మరువకుండా ఒకపనిచేస్తూండాలి. ఈ బలపపురాతితో పలకపైన ఒకసారి ఓంకారాన్ని వ్రాసి తర్వాత దాచిపెట్టు. ప్రతినిత్యా యీపని చేయాలి సుమా!".

ఓంకారాన్ని దినానికి ఒక్కసారే కానీగాక, వ్రాస్తూ రాగా రాగా, బలపపురాయి నానాటికి అరిగిపోతూ వచ్చింది. వాడు తినే నల్ల మందు మోతాదు సహా క్రమేపీ తీసికట్టయింది. వానికి పట్టిన పిచ్చికూడా దినానికి దినానికి సన్నగిలింది. అక్కడ తీరా బలపపురాయి ముగిసేసరికి - యిక్కడ వాని దురలవాటు పూరా సమసిపోయింది. చూచారా, యుక్తి. శక్తితో కానిపని యుక్తితో జరుగుతుంది.

అందువల్లనే — "శనైః శనైః" — (మెల్లమెల్లగా) అని భగవంతుడు చెప్పాడు. "స తు దీర్ఘకాలనైరంతర్యసేవితో దృఢభూమిః" — అని యోగాచార్యుడు పతంజలి చెప్పాడు.

"అర్జునా! పైన జెప్పిన అభ్యాసయోగాన్ని ఆచరించేటందుకు, యే కారణంతోనో వీలులేకపోతే — నీవు చేసే కర్మలన్నీ నా వల్లనే

(భగవంతుని వలననే) జరిగిపోతూన్నాయని భావించు. కర్తృత్వాన్ని అహంకారాన్ని వదలి నీ నిత్యవ్యవహారకార్యాలన్నీ చేస్తూపోతే క్రమంగా నీకు సిద్ధి లభిస్తుంది."

ప్రపంచంలో అందరికీ ఒకేసాధన పనికిరాదు. వారివారి స్వభావ పరిస్థితి పరిసరాలను బట్టి సాధనలుకూడ భిన్నభిన్నమై వుంటవి. అభ్యాస యోగమనేది కొంతమందికి ఆచరణసాధ్యం కాకపోవచ్చు. అట్టివారి నుద్దేశించి భగవంతుడు మరోసాధనను పేర్కొంటూన్నాడు. అనేక సాధనలు చెబితే - తన ప్రకృతికి అనుకూలించేదాన్ని సాధకుడు ఏరుకోవచ్చు.

మనం మన సంసారంలో కరచరణాది యింద్రియాలతో తెల్లవారింది మొదలు అస్తమానంవరకూ ఎన్నో పనులు చేస్తూన్నాం. శరీర నిర్వాహణకు — కుటుంబ నిర్వాహణకు — సమాజ నిర్వాహణకు విధాయుకంగా చేయవలసిన పనులు జేస్తూ, నేను చేస్తూన్నాననే కర్తృత్వాన్ని, నావల్లనే జరుగుతూన్నాయనే అహంకారాన్ని వదిలివేయాలి. అన్ని అనర్థాలకు కర్తృత్వబుద్ధే మూలం. బల్బులు వెల్గుతూన్నాయంటే కరెంటు వుంటే వెల్గుతూన్నాయి. అందులో బల్బుల ఘనత్వమేముంది? జడమైన యింద్రియాలు పనిచేస్తూన్నాయంటే, వీటికి శక్తినిచ్చే పవర్ హౌసు ప్రత్యేకంగా వుండాలి. పరిస్థితి అట్లుంటే - మధ్యలో లేనిపోని పెత్తనం - అహంకారం తనకెందుకని ? అకర్తృత్వబుద్ధి — నిరహంకార భావం చేకూర్తే బ్రహ్మప్రాప్తి ఎక్కువదూరంలో లేదు.

కర్మబంధంనుండి మానవుడు విడివడాలంటే అకర్తృత్వ బుద్ధికి మించిన తారకమంత్రం మరొక్కటిలేదు. "గహనా కర్మణోగతిః" — కర్మరహస్యం గహనమైందని సాక్షాత్తు భగవంతుడే నుడివాడు. మన మొక కర్మచేస్తాం; పనిచేస్తాం. చేసి ముగించాం. బహిరంగానికి ముగిసినట్లున్నా దాని పరంపర నశించలేదు; దాని దుంప చావలేదు. కర్మచేస్తే దానికొక ఫలితం వస్తుంది. ఫలాన్ని అనుభవిస్తే ఆ కర్మకు సంబంధించిన వాసన - సంస్కారం అంతఃకరణంపై బైతాయిస్తుంది. ఆ వాసనవల్ల మళ్ళీ జన్మమొస్తుంది. జన్మమెత్తి మరీ కర్మచేస్తాడు. కర్మవలన ఫలం - జందెంముూరవలె యిది తెగే రకంకాదు. కర్మఫలభోగవాసనా జన్మ కర్మలనెడి యీ సుడిగుండంనుండి బైటపడేకోసం భగవద్గీత ఒక మహా

కీలకం చెప్పింది. కర్తృత్వబుద్ధి వదలిపెట్టి కర్మచేస్తే కర్మ యథాప్రకారం సాగిపోతుంది. వాసనారూపంలో పరిణామం చెందదు. వాసనలు చస్తే పునర్జన్మానికి అవకాశం లేదు.

భగవద్గీతలో పలుతావుల శ్రీకృష్ణునికి మధుసూదనుడనే పేరు వాడబడింది. అది సార్థకమైనపేరు. మధువనే రాక్షసున్ని సంహరించాడు కాబట్టి మధుసూదనుడని చెప్పే అర్థం స్థూలదృష్టికి సరిపోతుంది. కానీ దీనికి ఆధ్యాత్మికమైన అర్థం ఏమి? మధువంటే తీపు. తేనెవలె అన్నింటి కంటె తీపైన వస్తువేది? అహంకారం. అహంకారాన్ని హరించేవాడు కాబట్టి ఆయనకు మధుసూదనుడని పేరు. అహంకారం సృష్టిలోని ఏ వస్తువుతోనూ చావదు. భగవత్సాక్షాత్కారంతోనే చావాలి.

కర్తృత్వాన్ని వదలి – అహంకారాన్ని వదలి కర్మలు చేస్తూంటే నీకు సిద్ధి లభిస్తుందని శ్రీకృష్ణుడుచెప్పి మరీ అంటున్నాడు.

"అర్జునా! నా యోగాన్ని — అకర్తృత్వయోగాన్ని, ఆశ్రయించి కర్మలు చేసేటందుకు చేతగాకపోతే — పోనీ — ఫలాసక్తి వదలి కర్మలను చేస్తూపో."

శ్రీకృష్ణుడు "నాయోగాన్ని ఆశ్రయించి కర్మలను చేయూ" లన్నాడు. అహంకారాన్ని కర్తృత్వబుద్ధిని వదలి చేయడమని అర్థం. కిరీటంపెట్టక రాజ్యాలేలాడు; కత్తిపట్టక యుద్ధంచేశాడు. ఏమిటీ అర్థం? కర్తృత్వాభిమానంలేక అన్నీ నెరవేర్చాడని అర్థం. ఆ యోగం శక్యం కాకపోతే ఏమి చేయాలి? పనులు చేస్తూన్నాననే కర్తృత్వబుద్ధి వున్నా ఫరవాలేదు; కాని ఈ కర్మఫలం నాకక్కరలేదు; శ్రీకృష్ణార్పణం; అని ఫలత్యాగాన్ని హృదయపూర్వకంగా చేయాలి. కర్తృత్వత్యాగం చేసే యోగ్యత లేకపోతే కర్మఫలత్యాగమైనా చేయమని ఆదేశిస్తూన్నాడు.

కర్మఫలత్యాగం సాధన; కర్తృత్వత్యాగం సాధ్యం. కర్మఫల త్యాగానికి పూర్ణత సిద్ధించాలంటే చివరికి కర్తృత్వ త్యాగం – అకర్తృత్వ భావన సిద్ధించే తీరాలి. తాను కర్తననుకొనే వరకు ఫలసంగముండనే వుంటుంది. తానుకర్తగాకపోతే ఫలంతో ఎక్కడి సంబంధం? లోకమాన్య తిలక్‌గారిది ఫలత్యాగ సిద్ధాంతం. శ్రీమచ్ఛంకరాచార్యులది అకర్తృత్వ సిద్ధాంతం.

భగవంతుడు సగుణోపాసనా విధానాన్ని వుపదేశిస్తూ నీ మనో బుద్ధులను నాయందుపెట్టమన్నాడు. అదీగాకపోతే — అహంకారాన్ని వదలి భగవదర్థకర్మలను చేయమన్నాడు. అదీ పోసగదంటే — సమస్త కర్మఫలములను కృష్ణార్పణం చేయుమన్నాడు. అదీ కాదనేవాడు — వాని గతి వాడు చూచుకోవచ్చు.

ఫలాసక్తిని వదలుట భగవద్గీతకు సర్వతోమాన్యమైన సిద్ధాంతం. ఫలాసక్తి నీచమైంది. "కృపణాః ఫలహేతవః" అని భగవద్గీతే తెగడింది. ఫలాసక్తి భక్తునికి తగదు. వాడు పనియందే దృష్టిపెట్టాలికాని ఫలము నందు పెట్టరాదు. ఈ విషయంలో పుండరీకుని చరిత్ర మంచిపాఠం బోధిస్తూంది.

మహాభక్తుడైన పుండరీకుడు పండిన వృద్ధులు — తలిదండ్రులకు నిరంతరం చక్కటి సేవజేసేవాడు. ఆ మాతాపితృసేవకు మించి అతనికి జపంలేదు; తపంలేదు. ఆతని నిష్ఠకు భగవంతుని హృదయం కరిగింది. ప్రసన్నుడైనాడు. భక్తుని అనుగ్రహించేకోసం శ్రీమన్నారాయణుడు పుండరీకుని యింటి ముందటికివచ్చి నిలబడ్డాడు. ఆసమయంలో పుండరీకుడు తల్లిదండ్రులసేవలో నిమగ్నుడై వున్నాడు. ఆతరుణంలో వచ్చిన పర మాత్మునిచూచి భక్తుడంటాడు. "భగవంతా! నిండాపనిలో వున్నాను. నాపని ముగిసేవరకూ మీరు దీనిపై నిలబడివుండం" డంటూ ఒక యిటుకరాతిని భగవంతుని తట్టువిసరివేశాడు.

తల్లిదండ్రులసేవ అనే కర్మకు భగవత్సాక్షాత్కారం ఫలమై వచ్చింది. ఆ సమయంలోకూడా ఆతనికి కర్తవ్యకర్మయందే దృష్టిగాని ఫలముపై దృష్టిలేదు. ఆయన భగవద్భావనతోడే తల్లిదండ్రుల సేవిస్తూ న్నాడు. జడమైన శరీరదృష్టితో చేయుటలేదు. తల్లిరూపంతో తండ్రి రూపంతో భార్యారూపంతో భర్తృరూపంతో, అన్నిరూపాలతో వుండే వాడు భగవంతుడేనని భక్తుని అభిప్రాయం. "త్వమేవ సర్వం మమ దేవదేవ!" — భగవచ్చైతన్యం తొలగిపోతే యీ శరీరాలు శవాలై కూర్చొంటాయి.

ఒక వ్యక్తి కలకత్తాలో వుద్యోగం చేస్తూన్నాడు. ఆతని తల్లి దండ్రి — అన్నలు తమ్ములు, తక్కిన కుటుంబమంతా యీ బంగారుపేట

లోనేవుంది. తండ్రి పెద్దభాయులాగా వున్నాడని ఈ వూరినుండి ఆయనకు తంతివార్త పోయింది. వెంటనే బెడ్డుగిడ్డూ బిగించి బయలుదేరాడు. "త్రూ"గా బంగారుపేటవచ్చి రైలు దిగాడు. ప్లాటుఫారంపై ఒక మిత్రుడు తటస్థమై "మీ నాయనగారు యిప్పుడే ఒక గంటముందు కాలమైపోయినా"డని చెప్పేశాడు. ఆదరబాదర యింటికి పరుగెత్తుకొని వచ్చాడు. బెడ్డుగిడ్డు ఒక మూల పారేశాడు. శవంవద్ద కూర్చొన్నాడు. పదిమందితోపాటు తానొకడై ఏడుస్తాడు. "మా నాయన వుండివుంటే మాట్లాడవలసిన విషయాలు మాట్లాడి వుండునుగదా?"అని విలపిస్తాడు. శరీరమే తండ్రి అయితే అది అక్కడే వుందిగదా! యథేష్టంగా మాట్లాడొచ్చు. ఎవరొద్దన్నారు? కానీ తండ్రి అనదగిన వస్తువు దాటిపోయింది.

ఇంక పుండరీకుని విషయంలోకి వస్తాం. ఆ సమయానికి తుకారామ స్వామివారు అక్కడికి వచ్చారు. పుండరీకునితట్టు చూచాడు. "ఏమిటోయ్; పుండరీకా! అతడు దేవుడయ్యా! ఏ మంత నిరాదరంగా వున్నావు? వెళ్లి ఆయనకు సేవాసత్కారాలు చెయ్." ఆ మాట విని పుండరీకుడంటాడు. "స్వామీ! వీరు దేవుళ్లుకాదా? ఆయనేనా దేవుడు? ఈ దేవుళ్లను వదలి ఆదేవున్ని పట్టడమేమిటి? నాది 'ఏ' సిద్ధాంతంకాదు. 'ఊ'సిద్ధాంతం, అతడే దేవుడని నేననను. అతడూ దేవుడే — ఇది నా భావన. అతడు మాత్రమే దేవుడుకాడు. అతడుకూడా దేవుడే - ఇది నా సిద్ధాంతం."

పుండరీకుని కర్మనిష్ఠ ఎంతగట్టిదో చూచారా? తుకారామస్వామి పరమభక్తుడంటూ మీకు తెలుసు. మహాజ్ఞాని అయికూడా సగుణపూజ చేసేవాడు. పెద్దపండితుడు కాకపోయినా, ఆయనవ్రాసిన అభంగాలు యీనాడు బొంబాయి విశ్వవిద్యాలయంలో పాఠ్యగ్రంథాలుగా వున్నాయి. ఆయన శివాజీచక్రవర్తికి ప్రథమగురువు.

ఒకరోజు తుకారాంగారు యింటిలో పూజాదికములు నిర్వర్తించుకొని ముంగిటిలోకివచ్చాడు. బ్యాండు మేళాలు — పూలమాలలు తీసుకొని పల్లకి ముందుపెట్టుకొని రాజపరివారం యింటిముందర నిలబడివుంది. తుకారామ్ విస్మయావిష్టచిత్తంతో, "ఎవరయ్యా మీరు? ఈ సంరంభ

మేమిటి? మనుష్యులను మోసుకపోయే యీ వాహన మెందుకు తెచ్చారు? ఈ యింటిలో అందరూ సజీవంగానేవున్నారే!" — అని వారిని అడిగాడు.

"తమరిని యీ పల్లకీలో కూచోపెట్టుకొని రాజసన్మానంతో నగరికి తీసికొనిరమ్మని ఛత్రపతి శివాజి పంపగా వచ్చినవాళ్ళం. చక్రవర్తి గారు తమరికి పాదపూజ చేయాలని అభిలషిస్తూన్నారు".

ఆ మాటలు వినీ వినడంతోటే తుకారామస్వామికి ఎక్కడలేని దుఃఖం పొంగివచ్చింది. సరాసరి యింటిలోని పాండురంగ విగ్రహానికి యెదుటపోయి నిలబడ్డాడు. వలవల ఏడుస్తాడు. "భగవంతా! ఎంత మోస గానివి. లంచమిచ్చి నా భక్తిని అపహరించాలని చూస్తూన్నావా? ఈ తుచ్ఛమైన మానమర్యాదలకోసమేనా నీ సేవ నేచేసేది?" చూచారా! తుకారాంగారి నిస్పృహాత్వం - నిష్కామత్వం, ఎంత పరాకాష్ఠ చెందిందో! తానిన్నాళ్లుచేసిన భక్తికి — పరిశ్రమకు ఫలం ప్రత్యక్షమైవచ్చినా భక్తుడు దానివెంట పడలేదు. భక్తునికి పనియందే దృష్టిగాని ఫలమునందుండరాదు.

ఇంతవరకు చెప్పిన సగుణోపాసనను భగవంతుడు ఉపసంహరిస్తూ న్నాడు.

"అర్జునా! అభ్యాసానికంటె జ్ఞానం శ్రేష్ఠమైంది. జ్ఞానానికంటె ధ్యానం మంచిది. ధ్యానంకంటె కర్మఫలత్యాగము హెచ్చు. ఆ మీద నిత్యశాంతి — ముక్తి లభిస్తుంది."

మూఢత్వంగాచేసే అభ్యాసానికంటె వివేకపరిజ్ఞానం మంచిది. పది మందీ చేస్తూన్నారు; నేనూ చేస్తాననే గొర్రెదాటుగాకాకుండా పరిణామ ప్రయోజనాలను గుర్తించే వివేకజ్ఞానం మంచిది. ఆ అంధానుకరణంతో— గతానుగతికంతో కల్గే అనర్థాన్నిగురించి ఒకకథ చెబుతాను.

అనగా అనగా ఒకరాజు. ఆయన రాణీవాసంలో అనేకమంది పాట కపుజనం పనిచేస్తూండేవారు. రాణిగారిబట్టలను వుతికేకోసం ప్రత్యేకంగా ఒక చాకలిది వుండేది. అది అందకత్తె, మంచి చాకచక్యం గలది. అంత రంగపరివారంలో ఒక్కతై రాణిగారిమెప్పును సంపాదించింది.

ఒకరోజు చాకలిది గుడ్డలకోసం రాణిగారి యింటికివచ్చింది. మహా రాణిగారు గుడ్డలువేస్తూ చాకలిదాని మొహంతట్టుచూచింది. చాకలమ్మ

జొటజొట కన్నీరు కారుస్తూండింది. "ఏమే! ఏమివిషయ?"మని రాణిగా రడిగారు. "అమ్మా! మా మల్లన్న చచ్చిపోయె" నంటూ పొంగిన దుఃఖంతో చాకలిది గొలుమని యేడ్చింది. చచ్చినవాడు చాకలిదానికి ముఖ్యబంధువేమో? పాపం! అంత ఆప్తురాలు ఏడుస్తూంటే తానుమాత్రం వూరుకోడం ఎంతబాగు? దాక్షిణ్యంతో వచ్చీరాని కన్నీళ్లు రాణిగారు పెట్టారు. రాణిగారే ఏడుస్తూంటే జీతాలుదినే దాసీలు వూరుకోవచ్చా? సరే – వారూ కూనరాగాలు ఆరంభించారు. అంతఃపురమంతా ఏడుస్తూందనేవార్త బైటికిపొక్కింది. ఆస్థానంలోవుండే రాజూకన్నీళ్ళుబెట్టాడు. రాణిగారి పుట్టింటివారేమైన మరణించారేమో! లేకపోతే అంతఃపురం ఎందుకు దుఃఖిస్తుంది? ఇదీవూహా. అంత రాజుగారే ఏడుస్తూంటే – ఏమని తామూరుకోవాలి? కొలువులోనివారంతా డిటో – డిటో. వెయ్యేల, ఈ జాడ్యం నిమిషాలుమీద వూరంతా ప్రాకింది. ఒకసాధువుగారు తీర్థ యాత్రబోతూ, మార్గమధ్యంలో ఆ వూరికివచ్చాడు. వూరంతా ఏడుస్తూంది. ఆయనకు చోద్యమైపోయింది. "ఎందుకయ్యా ఏడుస్తావ్?" – "నాకు తెలియదండీ ప్రక్కవాన్ని అడగండి" – ప్రక్కవాడూ అదేగతి. దాని కూలు (మూలం) దొరికే వరకూ వదలరాదని సాధువుగారు దీక్ష వహించారు. క్రమంగా ఆస్థానం వచ్చిచేరాడు. "మహారాజా! ఎందుకు దుఃఖస్తూన్నారు?"–

"అదేమో! అంతఃపురంవారు ఏడుస్తూన్నారు"

"ఎందుకు?"

"రాణిగారేడుస్తూంటే"

"అమ్మా! రాణీ! ఎందుకు ఏడ్పు?"

"చాకలిది ఏడుస్తూంది."

"చాకలమ్మా! ఎందుకేడుస్తావే?"

"మా మల్లన్న చచ్చాడు."

"ఎవరా మల్లన్న?"

"మూన్నాళ్ళక్రితం పుట్టిన గాడిదెపిల్ల."

క్రొత్తగాపుట్టి కోమలీకంగావున్న గాడిదెపిల్లకు చాకలిది ముద్దుగా

మల్లన్న అనే పేరుపెట్టుకొంది. రోగంవచ్చి ఆ గాడిదెపిల్ల కాస్తాచచ్చింది. ఇదీ కథా. చూచారా! లోకం గతానుగతికం.

అభ్యాసం మూఢంగావుండరాదు. దానికంటె వివేకజ్ఞానంమంచిది. ఇక్కడ జ్ఞానమనే మాటకు 'పరోక్షజ్ఞానమని — శాస్త్రజ్ఞానమని అర్థం చెప్పటకూడా కద్దు. ఆ శుష్క శాస్త్రజ్ఞానంకంటె ధ్యానంమేలు. ధ్యానము చిత్తశుద్ధిని ఏకాగ్రతను కల్గిస్తుంది. ఆ ధ్యానంకంటె కర్మఫలత్యాగం శ్రేష్ఠం. ధ్యానంలోకూడా సూక్ష్మమైన ఫలాసక్తివుంటుంది కాబట్టి, దానికంటె ఫలత్యాగం శ్రేష్ఠమన్నారు. అభ్యాస జ్ఞాన ధ్యాన కర్మఫల త్యాగాలల్లో ఏది లోపించినా సిద్ధి కల్గదు గాబట్టి సాధకుడు యీ నాల్గింటిని సమానంగా ఆదరించాలని కొందరు చెబుతారు.

ఇక్కడికి సాధనపరంపరలనుగూర్చిన చర్చ ముగిసింది.

— పంచమ విశ్రాంతి —



మకాం - బంగారుపేట.

ఆత్మీయులారా!

భగవద్గీత — పన్నెండో అధ్యాయం — 13 వ శ్లోకంనుండి భక్తుని లక్షణాలు చెప్పబడ్డవి. మన ప్రస్తుత ప్రసంగవిషయంకూడా అదే. ఈ భక్త లక్షణాలతో యీ అధ్యాయం ముగుస్తుంది. రెండవ అధ్యాయంలోని స్థితప్రజ్ఞుడు, ఆరవ అధ్యాయంలోని యోగి, పదుమూడవ అధ్యాయం లోని జ్ఞాని, పదునాల్గవ అధ్యాయంలోని గుణాతీతుడు, యీ 12 వ అధ్యాయంలోని భక్తునికి భిన్నులు కారు. ఒకే సిద్ధావస్థ భిన్నభిన్న రూపాలతో వర్ణింపబడింది.

భగవద్గీత అభిప్రాయంలో భక్తుడంటే ఏలాంటివాడు? నామం పెట్టేవాడా? విభూతి పెట్టేవాడా? తులసిపేర్లు వేసుకొంటేనా? రుద్రాక్ష మాలలు ధరిస్తేనా? మరి - భక్తుడంటే ఎవరని?

భగవంతుడు చెబుతూన్నాడు. "అర్జునా! సర్వభూతములలో ఎచ్చటకూడా ద్వేషభావము లేనివాడు భక్తుడు."

నీటికి నిప్పుకు పొత్తు కుదరనట్లు ద్వేషానికి భక్తికి పొత్తు కుదురదు. ఏరూపంగా కానీ గాక ! ద్వేషవృత్తి అంతఃకరణంలో వుందంటే వాడు భక్తుడు కాబోడు. "సర్వభూతానాం అద్వేష్టా" — అని భగవంతుడు చెబుతూన్నాడు. ఇస్లాంమతస్థులను ద్వేషింపవద్దని మహమ్మదు పైగంబరు తన మతంవారికి సౌభ్రాతృత్వాన్ని బోధించాడు. "మానవులంతా ఒకే తండ్రి బిడ్డలు. వారిని ద్వేషించొ"ద్దని క్రీస్తుప్రభువు చెప్పాడు. నీ మతం వారినని కాని, మానవులనుమాత్రమనికాని చెప్పక శ్రీకృష్ణుడు "సమస్త భూతాలను" అని చెప్పినాడు. భూతము అంటే పుట్టిన ప్రతి వస్తువుకూ అర్థం. నీ సజాతి మనుష్యులనుమాత్రమేకాదు. పశుపక్షి క్రిమికీటక చరాచర భూతాలల్లో ఎక్కడకూడా ద్వేషముండరాదని శ్రీకృష్ణుని సందేశం. 'వాసుదేవస్సర్వమితి' — సమస్తము వాసుదేవు డనే గీతావాక్యంపై విశ్వాసముందిగదా ! అలాంటప్పుడు దేన్ని ద్వేషించాలి? "ఆత్మౌపమ్యేన సర్వత్ర" అని గీత చెప్పింది. నీ ఆత్మే అంతటా వుంది. దేన్ని ద్వేషించినా నిన్ను నీవు ద్వేషించుకొన్నట్లే. తన్నుతాను ద్వేషించుకొనడం ఎక్కడైనా వుంటుందా?

అయితే ప్రపంచంలో వ్యవహరిస్తూండేటపుడు అనివార్యంగా రాగద్వేషాలు కల్గుతవి గదా? "ఇంద్రియస్యేంద్రియస్యార్థే—రాగద్వేషౌ వ్యవస్థితౌ" — ఇంద్రియాలకు కల్గే అనుకూల విషయ సాంగత్యంతో రాగమూ, ప్రతికూల విషయ సంపర్కంతో ద్వేషమూ సహజంగానే కల్గుతూంటుంది. వాటి బారినుండి తప్పుకొనే దేలాగ? అని ప్రశ్నిస్తారేమో ! ఆత్మౌపమ్యబుద్ధి చేకూరిందంటే యీ సమస్యలు ఉత్పన్నమే కావు.

నీ వొక మధ్యాహ్నంవేళ బఠాణీ గింజలను తింటూన్నావు. గబగబా నమిలేటప్పుడు పొరపాటుతో పళ్లసందున నాలుక పడింది. తీవ్రమైన బాధ కల్గింది. వాడుపండ్లు మెత్తని నాలుకను అమాంతం కొరికేశాయి. వీటికి తగిన శాస్తిచేస్తానంటూ రాతితో పళ్లను వూడగొట్టుకొంటావా అని? లేదు. అలా ఎప్పుడుకూడా చేయుడు. ఎంత బాధకానీ. ఎంత కోపంరానీ, ఓర్చుకొనే తీరాలి. ఎందుకు? ఆ నాలుకా నీదే — ఆ

పళ్లూ నీవే. రెంటియందూ నీకు ఆత్మీయతాబుద్ధి వుంది. పళ్లు పగుల కొట్టుకొంటే ఆబాధ ఎవరికి? అదీ నీకేగాదా?

"ఆత్మవత్సర్వభూతాని" — అనే సూత్రాన్ని అనుసరించినవానికి ఏవిధంగానూ ద్వేషముండ వీల్లేదు. సమస్తము వాసుదేవుడే అనే దృఢానుభూతి చేకూరిన మహాత్ముడెవరిని ద్వేషిస్తాడు? "చంపగా వచ్చినవారియందు కరవాలమునందును కాళియందు తానచ్యుతభావ ముంచి" — మహానుభావుడై ప్రవర్తించిన జడభరతుని కథ మనకు ప్రబలతార్కాణం. ప్రహ్లాదుడు తన్నుకన్న హింసలు పెట్టిన తండ్రికి ముక్తి కల్గించిన కొడుకై వెలిశాడు.

ఇది భక్తునికి మొదటో మొదట వుండవలసిన లక్షణం. ఏ భూతాన్నీ తాను ద్వేషింపరాదు. ఇంతమాత్రమే చాలా? చాలదు. కారణమేమంటే — ద్వేషింపరాదు అనేది నిషేధాత్మక లక్షణం. దీనికి తోడు నిర్మాణాత్మకలక్షణం జతైనపుడే సమగ్రత సిద్ధిస్తుంది. విధ్వంసక ప్రక్రియతో పాటు విధాయక ప్రక్రియ సైతం తోడై వుండాలి. వుండ కూడనిది ద్వేషం. మరి వుండవలసిందో; గ్రుక్క త్రిప్పకుండానే శ్రీ కృష్ణుడు చెబుతూన్నాడు — "మైత్రః కరుణ ఏవ చ."

"ద్వేషముండరాదు" — ఈలక్షణముంటే భక్తుడైనట్లు భావిం చొచ్చా? ఇదో! ఈ స్తంభం ఎవరిని ద్వేషించింది? ఈగోడ ఎవర్ని ద్వేషిస్తుంది? — అంతమాత్రంతో వీటిని భక్తులనవచ్చా? "ద్వేషము లేనివాడు" — అనేలక్షణం యీవిధంగా దురుపయోగం కాకుండా, "మైత్రః కరుణ ఏవ చ" — అని భగవంతుడు విషయాన్ని పూరించాడు.

మనకు భూమిలో పంటరావాలంటే రెండుపనులు చేస్తాము. మొదట అందులోని గడ్డిగాదం తీసేస్తాము. తర్వాత విత్తనాలు చల్లు తాము., మొదటిది విధ్వంసక పద్ధతి. రెండోది విధాయకపద్ధతి. రెండూ కలిసినప్పుడే కార్యానికి సమగ్రత.

అట్లే యిక్కడకూడా చెప్పేదేమంటే — ఏ భూతాన్నీ ద్వేషింప రాదు. పైపెచ్చు, అన్నిటిని ప్రేమించాలి. మొదటిది విధ్వంసకపద్ధతి. రెండోది విధాయకపద్ధతి. రెండూకలిస్తే భక్తుని స్వరూపానికి సమగ్రత.

"అద్వేష్టా సర్వభూతానాం" — ఇది భక్తునికి ప్రథమలక్షణం. "మైత్రః" — ఇది రెండో లక్షణం. జ్ఞానులయందు — పెద్దలయందు — భక్తులయందు, మైత్రిచూపాలి. "కరుణః" — ఇది మూడో లక్షణం. దీనులయందు — దుఃఖితులయందు, దయచూపేవాడై వుండాలి.

యోగశాస్త్రంలో యోగికుండవలసిన నాల్గులక్షణాలను చెప్పారు. "మైత్రీ కరుణ ముదితా ఉపేక్ష" లనేవి నాల్గుభావాలు. సమానులయెడ మైత్రి — తక్కువవారియెడ కరుణ — సుఖంగా హాయిగా యశస్సుగా జీవించేవారిని జూచి ముదిత — అనగా ఆహ్లాదం — దుష్టులను నీచులను చూచినపుడు ఉపేక్ష — ఉదాసీనం; ఈ నాల్గింటిని యోగశాస్త్రం ప్రతిపాదించింది. దుర్మార్గులపట్లకూడా ఉపేక్షే కాని ద్వేషం వుండరాదు. ఉపేక్ష అంటే ద్వేషమంటే వేరే వేరే. రెండూ ఒక్కటిగా భావింపకూడదు.

"నిర్మమః" — ఇది భక్తునిగూర్చి యీ శ్లోకంలో చెప్పిన నాల్గో లక్షణం. భక్తునికి మమకారం వుండరాదు. తల్లి తనపిల్లలను ద్వేషింపదు. వారు దుష్టులుకానీ — దుండగులు కానీగాక. ఆమెకు ద్వేషంలేదు. వారియందు మైత్రి చూపుతుంది. కరుణచూపుతుంది. కాని ఆమెకు వారియందు మమకారం వుంది. ఆ ప్రేమ తనబిడ్డలయందే పరిమితం. పొరిగింటిబిడ్డలయందు లేదు. తనబిడ్డలను దండించి కొట్టేటపుడు అరచేతిని దొప్పలాగాచేసి కొట్టుంది. పరాయిబిడ్డలను కొట్టేటపుడు చాచికొట్టుంది. ఎందుకీతేడా? తనబిడ్డలపై మమకారంవుంది. ఈ మమకారం భక్తునికి వుండరాదు. మమకారాన్ని పెట్టుకొంటావా? విశ్వమంతా పెట్టుకో. వదుల్తావా? అది యెక్కడాలేకుండా తీర్మానంగా వదులు. రెండేమార్గాలు. "కామింపకయును సర్వము కామించియునైన" — ఎట్లైనాసరే. నాది అనేవస్తువు ఏదీలేదు. ఇదొక్కమార్గం. ప్రపంచమంతా నాదే — ఇదో మార్గం.

పరిఛ్ఛిన్నమైన మమకారం చాలాచెడ్డది. అర్జునునంతటి ధీరవీర శూరుణ్ణి కన్నతిప్పలు పెట్టిందంటే — సామాన్యులను వదుల్తుందా? దేవేంద్రుని అంశలో పుట్టాడు. మహాభక్తురాలు కుంతీదేవికి కొడుకు.

ధర్మరాజుకు సొంతతమ్ముడు. కృష్ణునికి ప్రాణస్నేహితుడు. సాక్షాత్తు ఫాలాక్షుణి మెప్పించినదిట్ట. పదుమూడు సంవత్సరాలు కాయకసుర్లుదిని తపస్సుచేసిన మహనీయమూర్తి. ఊర్వశి అంతటి త్రిభువనసుందరిని కన్నెత్తిచూడని జితేంద్రియ చక్రవర్తి. అంతంతటివాడు మమకారందెబ్బకు బోల్తాపడ్డాడు. "మహాగజాః పలాయంతే — మశకానాం తు కా గతిః"

భక్తుడు "నిరహంకారః" — అహంకారము లేనివాడు. మమకారానికి మూలం అహంకారం. అహంవృత్తి వున్నపుడే మమవృత్తి. అజ్ఞానమే లేనివానికి అహంకారమెక్కడిది? అనాత్మ పదార్థాలల్లో వారికి ఆత్మభ్రాంతి లేదు. వాని చిజ్జడగ్రంధి విచ్చిపోయింది.

తర్వాత యీ శ్లోకంలో భక్తుని ఆరోలక్షణం 'సమదుఃఖసుఖః' అని చెప్పబడింది. భక్తుడు సుఖదుఃఖాలల్లో సమంగావుంటాడు. ద్రష్టను దృశ్యంలోకలిపే లంకె — అహంకారమే తెగిపోయింది. కాబట్టి సుఖదుఃఖాల ప్రభావం వానివరకు పోలేదు. సుఖదుఃఖాలు అంతఃకరణ ధర్మాలు. తాను అంతఃకరణానికి విలక్షణమైన ఆత్మ. ఆనందమే తనధర్మం. మరొక్క విధంగా — భగవద్గీత పదో అధ్యాయం నాల్గో శ్లోకంలో చెప్పినట్లు సుఖదుఃఖాలు భగవంతుని తరుపున వస్తాయి. ఆయన పంపినవాటిని భక్తుడెలా తిరస్కరిస్తాడు? జ్ఞానిదృష్టిలో సుఖదుఃఖాలుకూడా బ్రహ్మస్వరూపాలే. "సమం బ్రహ్మ" — అనేచోట సమశబ్దానికి బ్రహ్మమని భగవద్గీతలో అర్థం చెప్పబడింది.

మనము సుఖాన్ని ప్రేమిస్తాము. దుఃఖాన్ని ద్వేషిస్తాము. వాస్తవానికి — సుఖం మోసం చేస్తుంది. మేలుచేసేది దుఃఖమే. న్యాయమేమంటే — దుఃఖాన్ని ప్రేమించాలి; సుఖాన్ని ద్వేషించాలి. గీతలో విషాదయోగం ముందేవచ్చింది. దుఃఖహాలాహలాన్ని మ్రింగినవాడే మహాదేవుడైనాడు. తక్కినవారు చిల్లరదేవుండ్లే. ప్రారబ్ధానుసారంగా వచ్చిన దుఃఖాలకు పిఱికివక ఢీకొని పోరాడినదిట్టలే చరిత్రను గుర్తుకొన్నారు. అలలు పర్వతాన్ని చలింపజేయలేనట్లు, సుఖదుఃఖాలు భక్తుణ్ణి చలింపజేయలేవు. "నిరయంబైన నిబంధమైన ధరణీ నిర్మూలనంబైన" — తూర్పున పొడిచేసూర్యుడు పశ్చిమాన పొడచూపినీగాక. వాని దృఢభక్తికి చలనం లేదు.

భక్తునిగురించి యీశ్లోకంలోచెప్పిన యేడవలక్షణం 'క్షమ'. క్షమ అంటే ఓర్పు — సహనం. విధిలేక — గతిలేక ఓర్చుకోడం క్షమకాదు. "చెల్లియుండియు సైరణజేయు నతడు" — నిజమైన క్షమావంతుడు.

ఛత్రపతి శివాజీ చక్రవర్తికి మొదటి గురువు తుకారామస్వామి. రెండోగురువు సమర్థరామదాసస్వామి. ఒక పర్యాయం సమర్థుడు శివాజి వద్దకు పయనమైనాడు. వెంట పదిమంది శిష్యులున్నారు. అందరూ నడిచే పోతున్నారు. ప్రయాణం దూరభారం. ప్రొద్దు నన్నెత్తికి వచ్చింది. ఆకలి చిచ్చైమండుతూంది. బడలిక తీర్చుకొనేకోసం మార్గమధ్యంలో శిష్యులతోసహా సమర్థుడు ఒక చెట్టుక్రింద కూర్చున్నాడు. ప్రక్కలోనే ఒక పెద్దచెఱుకుతోట. రెట్టలావు చెఱుకుగడలు. శిష్యులకు నోటిలో నీరూరింది. "స్వామీ! ఆకలికొట్టుమిట్టాట్టూంది ? తలా వొక్కచెరుకుగడ తెచ్చుకొని తిందామా? తోటయజమాని సమయానికి లేనట్లుంది. అయితేనేం? ఇంతలో వస్తే డబ్బే యిచ్చేస్తాం. లేదా! ఏం మహాభాగ్యం? సాధువులం తింటే తప్పొచ్చిందా? వాని పుణ్యమే పండింది. తలావొకటి తెచ్చుకొందాం." — అని శిష్యులు గురువుతో చెప్పేశారు. వద్దని చెబితే వినేరకంలో లేరు. "నందో రాజా భవిష్యతి" — ఏమైనాకానీ, గురువుగారు వూఁకొట్టి వూరుకొన్నారు. శిష్యోత్తములు అనుకొన్నంత పనీ చేశారు. మాంచి చెరుకుగడలు తలా వొకటి తెచ్చుకొని, గురువుగారికి కూడ ఒకటి సప్లయిచేసి, "లంబోదరాయ నమః – ఉదరం పూజయామి" పూజ ఆరంభించారు. స్వామిగారుమాత్రం చెరుకు తుంటను చేతిలో పట్టుకొని వూరక కూర్చునివున్నారు. అంతవరకూ కాపలాకాచి తీరా అప్పుడే తిండికిపోయి ఆదరబాదర తోటయజమాని వస్తూన్నాడు. దూరం నుండి చూచాడు. తోట మాదే పొమ్మన్నట్లు చేతెడు చేతెడు పొడుగు చెరుకులను ఠీవిగా తింటూండే యీ సాధుతండం అతని చూపుల్లోపడింది. మజాగా తింటూన్నారు. వాని కడుపు భగ్గుమనింది. అరికాలిమంట నన్నెత్తికెక్కింది. ఆగ్రహోదగ్రుడైనాడు. వెనుకముందు చూడలేదు. రివ్వున వొక్కపరుగులో ఆ మూకపై విరుచుకపడ్డాడు. సమర్థస్వామి చేతిలోని గడను సర్రున లాక్కొన్నాడు. ఫెళీఫెళీమంటూ వీపులు పగిలేటట్లు వడ్డిస్తూన్నాడు. వారేమో చెప్పబోతారు; కాని వాడు వినే

అవస్థ దాటిపోయివున్నాడు. "తినండి కమ్మగా తినండి" — అని స్వామి వారు చల్లగా అంటూన్నారు.

ఎట్లైతేనేం. సాయంకాలానికి శివాజి యింటికి అంతా చేరుకొన్నారు. కాళ్లకు పావుకోళ్లు — చంకలో యోగదండం — ఎడమచేతి కొంకికి జోలె — కుడిచేతిలో జపమాల, భవ్యమూర్తి — దివ్యమూర్తి శ్రీ సమర్థ రాముడు రాజనగరు ముందట నిలబడి "జయజయరఘువీర సమర్థ" — అని గర్జించాడు. భవనమంతా ప్రతిధ్వనించింది. శివాజీ పరుగుపరుగున వచ్చి ఒక కాగితంకు జోలెలో పడవేసి సాగిలిపడి గురుదేవునికి నమస్కరించాడు. సమర్థుడు జోలెలోని తామ్రశాసనాన్నియెత్తి చూచాడు.

"గురుదేవా! నేను — నాకుటుంబం — నా రాజ్యం — సమస్తం మీ అధీనం. మీకు సమర్పిస్తూన్నాను." — అని అందులో వ్రాయబడి వుంది. చివరిలో "శివ"అని సంతకంకూడ పెట్టబడివుంది.

"శివా! యిదేమిటి?"

"ప్రభూ! అదికూడా మీ ప్రేరణే."

"నాయనా! అట్లే కానిమ్ము. రాజ్యమునాది. పాలించే వాడవు నీవు. రాజ్యము నాదని నీవనుకోవద్దు. గురువుదనుకో. గురురాజ్యాన్ని నిర్లిప్తుడవై పాలించు. నీ శరీరంకూడ నాదే కాబట్టి చెప్పినట్లు వినాలి."

"చిత్తము. అజ్ఞ శిరసావహిస్తాను."

ఆ క్షణమే శివాజి తన మరాఠా సామ్రాజ్యానికి భగవా (కావి) జెండా యెగురవేయించాడు.

దూరభారం నుండి వచ్చిన గురువులవారికి స్నానోపచారాలు స్వయంగా శివాజి తానే నిర్వహించాడు. సమర్థునికి స్నానం చేయించేటపుడు వీపుపై యేర్పడివుండే వాతలను చూచాడు. కంగారుపడ్డాడు. స్నానాదికాలు నిర్వర్తింపచేసి ఆ విషయాన్నిగూర్చి శిష్యమండలిని అడిగాడు. వారికి అవకాశం దొరికింది. అసలు వడ్డీ తీర్చుకోవాలనుకొన్నారు.

"మహారాజా! ఆకలికి నాలు గ్గడలను విరుచుకొన్నాము. ఆ రైతు మహాఇదిగా కొంపమునిగినట్లు పెద్దచిన్న తారతమ్యమైనా లేకుండా అందర్నీ తెగబాదాడు. శ్రీవారినికూడా వదల్లేదు. ఎందుకు వదుల్తాడు? నాకే కుక్కకు లింగమేం — పాణివట్టమేం? ఏదో నేలపై మాకు యింకా

అన్నం వుండింది. చావుతప్పి కన్నులొట్టపోయి వచ్చాం. ప్రభూ! మీ రాజ్యంలోకూడ యింత అన్యాయమా?" — శిష్యులు అఘాయిత్య మంతా వెళ్లబోశారు.

మరురోజు మంత్రులు — సామంతులు, నౌకరులు — చాకరులు, కొలువుకూటం కిటకిటలాడిపోతూంది. సమర్థ రాముడు రాజసింహాస నాన్ని అలంకరించివున్నాడు. "యోగరతో వా భోగరతో వా — సంగరతో వా సంగవిహీనః" — గంగా యమునల సంగమంవలె యోగ—భోగాల సమ్మిశ్రణం నయనానందకరంగా వుంది.

రైతును — చెరుకుతోట అసామిని సరాసరి తెచ్చి రక్షకభటులు సభలోనిలిపారు. సింహాసనంపై నుండే సమర్థుని చూస్తూనే వానిప్రాణాలు పైన్నే ఎగిరిపోయాయి. ఆకాశమువిరిగి నెత్తినపడ్డట్టు అయింది. చేతులు కట్టుకొని గమ్మున వున్నాడు.

"గురునాథా! యితడే నిన్న మీకు మహాపచారంచేసిన ద్రోహి. దేవరవారేమి సెలవిస్తారో — ఆ శిక్ష వీనికి విధింపబడ్తుంది." — లేచి నిలబడి శివాజి గురువుతో మనవిచేశాడు.

"శివా! ఇతడు తనపొలానికి సాలీనా పన్ను ఎంత చెల్లిస్తాడు?"— అని రామదాసుగారి ప్రశ్న.

"ఏభై రూపాయలు" —

"సరే. ఇప్పటినుండి యితడు వంశపరంపరగా — శాశ్వతంగా, ఆ భూమిని శిస్తుమాఫీతో అనుభవించుకోవచ్చు."

సభ స్తబ్ధమైపోయింది. అదిరా సమర్థుని క్షమ. సమర్థమైన క్షమకూడా అదే. మూర్ఖులతో మాట్లాడేటందుకంటె జ్ఞానులతో కొట్లాడినా మంచిదేనని సామెత చెబుతారు.

ఇక్కడికొక శ్లోకం ముగిసింది. భక్తునిగురించి యిందులో యేడు లక్షణాలు చెప్పబడ్డాయి. ప్రయత్నించి ఒక్కలక్షణాన్నయినా సంపా దించుకొంటే తక్కినవి వాటంతకవే సమకూరి వస్తాయి.

"సంతుష్ట స్సతతం యోగీ — యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పితమనోబుద్ధిః — యో మద్భక్తస్స మే ప్రియః॥"

ఇది పన్నాలుగో శ్లోకం. ఇందులో 'సతతం' అనే పదాన్ని ప్రతి మాటతో జతపరచుకోవాలి. (1) సతతం సంతుష్టః. (2) సతతం యోగీ. (3) సతతం యతాత్మా. (4) సతతం దృఢనిశ్చయః. (5) సతతం మయ్యర్పిత మనోబుద్ధిః. ఈ లక్షణాలు కలవాడెవడో వాడే, అష్ట భార్యలకంటె శ్రీకృష్ణునికి ప్రియమైనవాడు.

ఈ లక్షణాలను వరుసగా విమర్శించుకొందాం. భక్తుడు 'సతతం సంతుష్టః' — సర్వదా సంతృప్తితో వుంటాడు. ఆయన సతత సంతుష్టుడు. మనం అప్పుడప్పుడు సంతుష్టులం. కడుపు నిండినపుడు — పండగలు పబ్బాలు వచ్చినపుడు — అన్ని పరిస్థితులు వైసంగా అమరివుండినప్పుడు, మనమూ సంతుష్టులమే. ఒకపూట కాఫీ లేకపోతే — టైముకు సరిగ్గా రైలు రాకపోతే — అనుకొన్నపని కాకపోతే, మన సంతుష్టి చెప్పకుండా యే దేశానికో పారిపోతుంది.

ఆచార్య వినోబాగారు ఒక మిత్రునితో కలిసి అలా సాయంకాలం వాకింగు వెళ్లారు. గ్రామందాటి కొంతదూరం బైటికి వెళ్లిపోయారు. కాలం చైత్రమాసం. యెండలు ముదిరాయి. అక్కడ ఒకదృశ్యం అగపడింది. మిత్రుడు వినోబాను అడిగాడు. "బాబూ! రోడ్డుకు యిరువైపులావుండే యీ పెద్దవృక్షాలు కళకళలాడుతున్నాయి. ఎదురుగా పొలంలోవుండే ఆ చిన్న చెట్లు మలమలలాడుతున్నాయి. ఈ చెట్లు కళకళలాడడానికి, ఆ చెట్లు మలమలలాడడానికి కారణమే"మని మిత్రుడు ప్రశ్నించాడు.

"ఈ వృక్షాలవేర్లు నీటిమట్టంవరకు పోయాయి; ఇవి కళకళలాడుతున్నాయి. వాటివేర్లు పైపైన్నే వున్నాయి. కాబట్టి మలమలలాడుతున్నాయి." — అని వినోబా చెప్పారు.

ఇదొక్క సూత్రం. ఎవనిమనస్సు అధిష్ఠానవస్తువైన భగవంతునివరకూ వ్యాపించివుంటుందో, వాడు 'సతతం సంతుష్టః'. నిత్యనిరంతరము కళకళలాడుతుంటాడు. ఎవనిమనస్సు పైపైగా అనిత్యాలైన నామరూప వస్తువులపైననే వుంటుందో వాడు మలమలమాడుతుంటాడు.

తర్వాతిలక్షణం 'సతతం యోగీ'. భక్తుడు సతతము యోగియై వుంటాడు. మనమో ప్రొద్దునయోగులం. మధ్యాహ్ననికి భోగులం.

రాత్రికి రోగులం. దినానికి యిన్ని అవతారాలు ధరిస్తాం. అతడు సతతం యోగి. మనం ప్రొద్దున ఒకగంట, సాయంత్రం ఒకగంట యోగులమై వుంటాం. తక్కిన యిరవై రెండుగంటలు వియోగులం. వీధిలో యోగులం. ఇంట్లో రోగులం. బైట యోగులం. లోపల రోగులం. మన గ్రహచారం యిలావుంది. ఈ ఆట పనికిరాదు. సతతయోగి కావాలి. భక్తుడు మన లాగానే పనులుపాటలు చేస్తూంటాడు. మనవలెనే తింటాడు; కంటాడు. వింటాడు; విహరిస్తాడు. కానీ భేదమెక్కడ? అతడు మనవలెనే ప్రపంచంలోవున్నా, అతనిలోపల ప్రపంచం లేదు; పరమాత్ముడున్నాడు. మనకో — లోపలా వెలుపలా ఒకటేసరుకు. ప్రపంచంలో నువ్వు వుండొచ్చు; కానీ ప్రపంచం నీలో వుండరాదని పరమహంస శ్రీరామ కృష్ణుడు బోధించేవాడు. నీళ్లల్లో పడవ వుండొచ్చు. కాని పడవలో నీళ్లుండరాదు. దోమలలో దోమతెర వుండొచ్చు. కానీ — దోమ తెరలో దోమలుండరాదు. నీవు ప్రపంచంలోవుండు; ఫరవాలేదు. కాని ప్రపంచాన్ని నీలో పెట్టుకోవద్దు.

ఊం. తర్వాత; 'సతతం యతాత్మా.' ఇది శ్లోకంలో భక్తునికి చెప్పిన మూడో లక్షణం. శరీరేంద్రియాలను సంయమం చేసినవాన్ని 'యతాత్మ'డంటారు. 'ఆత్మ' అనేశబ్దం యిచోట శరీరానికి — ఇంద్రియాలకు — మనస్సుకు అర్థమౌతుంది. లోకాలన్నీ జయించడం సులువే కాని తన్నుతాను జయించుట మహాకష్టం. అన్ని కంట్రోళ్లకంటె తన కంట్రోలు (Self control) గొప్పది. వాక్స్వాతంత్ర్యం — భావ స్వాతంత్ర్యం — ఆర్థికస్వాతంత్ర్యం — రాజకీయస్వాతంత్ర్యం, యిా అన్ని స్వాతంత్ర్యాలకంటె ఆత్మస్వాతంత్ర్యం ఉత్కృష్టమైంది. ఆత్మస్వాతంత్ర్యం లేనివానికి లభించిన స్వాతంత్ర్యాలన్నీ కలకాలం మనలేవు. వాటికి భద్రతలేదు.

బైటి స్వారాజ్యానికి భద్రతకావాలంటే, జాగ్రత్తపడి లోపలి స్వారాజ్యాన్ని సంపాదించాలి. దేహేంద్రియాలు నీకోరకున్నాయి గాని వాటికోరకు నీవులేవు. అవి నీ అధీనంలో వుండాలి. "చూడవలసిన వస్తువులనే నాకన్నులు చూస్తాయి. వినవలసిన మాటలనే నాచెవులు వింటాయి. చేయవలసిన పనులనే నా యింద్రియాలు చేస్తవి. తలంచ

వలసిన విషయాలనే నా మనస్సు తలస్తుంది" — అని మహానుభావుడు జ్ఞానేశ్వరుడు చెప్పాడు. ఎంత గంభీరమైనమాట!

భక్తుడు కాగోరేవాడు 'సతతం యతాత్ముడు' కావాలి. నిజంగా భక్తులంకావాలనే కోర్కె మనకుంటేగా! బడాయికి శివభక్తుడనని చెప్పు కొనుటేగాని వాస్తవానికి తాను శివభక్తుడు. చేసేదంతా శవపూజే. శివపూజెక్కడిది? బొట్లు - బోనాలు, పూజలు - పులకాపనలు, ఆర తులు — మంగళారతులు, అన్నీ యీ శవానికే. పేరు శివపూజ. దేవు నికి నైవేద్యం పెట్టున్నామంటే, పెట్టినది పెట్టినట్లూ మళ్ళీ మనకే మొత్తం వస్తుందని గట్టిగా తెలుసు. కాబట్టే పెట్టున్నాం.

"సతతం దృఢనిశ్చయః" భక్తుడు సతతమూ దృఢనిశ్చయుడు. మనమో — అపుడపుడు, ఉగాది పండుగనాడు — స్వాతంత్ర్యోత్సవదినం నాడు — ఆశ్రమవార్షికోత్సవ సంరంభంనాడు — కడుపునిండినపుడు — ఆవేశం పెరిగినపుడు, అచ్చం దృఢనిశ్చయులం. ఊసరవెల్లిలాగా రంగులు మార్చుకొనేవాడు భక్తుడు కాబోడు. ఆయన భగవంతునికి భక్తుడు; మనం పరిస్థితులకు భక్తులం.

అక్బరు ఆస్థానంలో వీరబల్ ముఖ్యుడు. ఒకరోజు వంటవాడు వంకాయకూర భలే మజాగాచేశాడు. అక్బరు బ్రహ్మానందంగా భుజిం చాడు. బైటకివచ్చి "వీరబల్! వంకాయ లక్షణ మెట్టిదయ్యా?" — అని గమ్మత్తుగా అడిగాడు. "ప్రభూ! చెప్పేదేముంది? వంకాయవంటి కూర — శంకరునివంటి దైవం, లేదని లోకమంతా ప్రసిద్ధేకదా" — అని యుక్తియుక్తంగా — సందర్భోచితంగా సమాధానం చెప్పాడు. నాల్గు రోజులు గడిచాయి. వంటవాడు మీదమీద వంకాయకూరే చేస్తూ వచ్చాడు. అక్బరు చక్రవర్తికి తలవాచింది. "వీరబల్! వంకాయ లక్షణ మేలాంటిదంటావు?" అని మళ్ళీ అడిగాడు. "హుజూర్! వట్టి పనికిమా లినది. ఏ వైద్యునైనా అడగండి. మొదట్లో వంకాయను నిషేధిస్తాడు. అందుకే బజార్లో అది కారు చవుక — కుక్కఅగ్గువ." ఇదీ వీరబలుని జవాబు.

"వీరబల్! మొన్న అలాచెప్పావ్. ఈరోజు యిలా చెబుతూన్నావు. ఏమిటయ్యా నీ అవకతవకః?" — అక్బర్ అన్నాడు.

"ఏలినవాడా! నేను నీకు జీతగాణ్ణికాని వంకాయకు కాదుగదా" — అని బీర్బల్ పలికేసరికి అక్బరు పకాపక నవ్వాడు.

పరిస్థితిత్రోసినట్లు మననిశ్చయాలు దొర్లిపోతూంటాయి. దృఢ నిశ్చయం మాట దేవుడెఱుగు? అసలు _ నిశ్చయమంటూ ఒకటి వుంటేగా! పురమే లేనివానికి అంతఃపురమెక్కడిది? భక్తుడొకదశా ఆత్మనిశ్చయం— బ్రహ్మనిశ్చయం—ఈశ్వరనిశ్చయం, చేకొడంటే ఆ నిశ్చయానికి మరి చలనంలేదు.

"మయ్యర్పితమనోబుద్ధిః యో మద్భక్తస్స మే ప్రియః" —

"అర్జునా! తన మనోబుద్ధులను నాయందే యెవడు సమర్పించి వుంటాడో — వాడే నాకు ప్రియమైన భక్తుడు".

నదీ ప్రవాహాలు అప్రయత్నంగా సముద్రంలో పడిపోవుసట్లు భక్తుని చిత్తవృత్తులుసైతం భగవదాకారంచెంది భగవంతునిలో పడిపో తూంటాయి. సముద్రంలో పడిపోయే నదీ ప్రవాహాన్ని అరికట్టేందుకు — అటకాయించేటందుకు ఎవరికి సాధ్యం? "అంబుజోదర దివ్యపాదార వింద — చింతనామృతపాన విశేషమత్త — చిత్తమేరీతి నితరంబు జేర నేర్చు?"

అట్టివాడే నాకు ప్రియమైన భక్తుడని భగవంతుడంటూన్నాడు. భగవంతుడు భక్తుని ప్రేమించినప్పుడే భక్తికి పూర్ణప్రయోజనం సిద్ధించి నట్లు. తాను భక్తుడననే అభిమానంకూడా భక్తునికి వుండరాదు. ఆ అభిమానంవుంటే భగవంతుని రిజిష్టరులో వాడు దాఖలు కాలేదు.

భక్తుని లక్షణాలను యీ విధంగా చెప్పి, తనివిలేక భగవానుడు మరీ చెబుతూన్నాడు.

"అర్జునా! ప్రపంచానికి అభయమిచ్చి భక్తుడు నిర్భ యుడై వుంటాడు. సుఖదుఃఖాలు — భయసంభ్రమాలు వాన్ని విడిచి పెట్టి పోయాయి".

గీతా విద్యార్థికి నిర్భయం ప్రథమ సుగుణం. భయమొక పెద్ద రోగం. భయస్థుడు దినమూపుట్టాడు; దినమూ చస్తాడు. భయపడేది పశులక్షణం; భయపెట్టేది మృగలక్షణం. భక్తుడు భయపడడు; భయ

పెట్టడు. సర్వభూతాలకు అభయమిచ్చి వాడు సంన్యాసి యయ్యాడు. తనచుట్టూ నారాయణుడే వుండగా వానికి భయమెందుకు? పైన నారాయణుడు — ప్రక్కన నారాయణుడు, క్రింద నారాయణుడు — మీాద నారాయణుడు, ముందు నారాయణుడు _ వెనుక నారాయణుడు, — చుట్టూ నారాయణుడు _ ముట్టూ నారాయణుడు, _ గట్టినారాయణ కవచాన్ని దిట్టంగా బిగించుకొన్నాడు. ఇక పో! "కిం కరిష్యతి వై యమః". విశ్వరూపభగవంతుడు తన్ను గర్భంలో పెట్టుకొని రక్షిస్తూండగా యిక తానెవరికి భయపడాలి. కావున భక్తుడు భయపడడు. భయము తనవద్ద వుంటేగా యితరులకు పెట్టేది. కాబట్టి భక్తుడు భయపెట్టడు.

చీకటి భయస్థానం; వెలుగు నిర్భయస్థానం. చీకటిలో పయనం చేయాలంటే, రాళ్లు రప్పలు - ముళ్లు ముష్టి _ గుంట మిట్ట _ తేళ్లు పాములు, ఎన్నో సంకటాల్ను ఎదుర్కోవాలి. చేతిలో దీపంవుంటే అన్ని వుపద్రవాలను పైదొలగించుకొని తిన్నగా గమ్యాన్ని చేరుకోవచ్చు. అజ్ఞానం భయకారణం; జ్ఞానం నిర్భయ కారణం. జ్ఞానమంటే ఏమిటాజ్ఞానం? తానంటే ఎవరు? ఈశ్వరుడంటే ఎవడు? జగత్తంటే ఏమి? — వీటి పూర్ణస్వరూపజ్ఞానమే నిజమైన జ్ఞానం.

వీలుంటే యితరులకు ఉపకారమేచేస్తాడు. కాని, భక్తుడు పరులకు సంతాపకరమైన కార్యాలు చేయడు. తనలోని జలజంతువు లెంతెంత రాయిడి పెట్టూన్నా సముద్రానికి ఆ చింతేలేదు. తన ప్రణవగానమే గానం. తాను లోకానికి భయపడదు. లోకాన్ని భయపెట్టాలనీ దానికి లేదు. భక్తుడు ఆ సముద్రంలాంటివాడు.

హర్షము - అమర్షము _ భయము _ ఉద్వేగములతో విడువబడినవాడే భక్తుడని భగవంతుని అభిప్రాయం. వీటిని వదలిపెడ్తే అవి మళ్లీ వచ్చి పడ్తావేమో! అవే వదలిపెట్టి పోయాయి. తమకు మర్యాద లేనిచోట ఎందుకుండాలని కామోసు! పాపం, అవి నిరాశచేసికొని దాటి పోయాయి. "ముక్తః" — అనగా విడువబడినవాడని అర్థం.

హర్షమనగా—అనుకూల పరిస్థితులలో మనస్సు పరవశమైపోవుట. స్వామివారు భలే వుపన్యాసం చెప్పారని యెవరైనా నా చెవిలో పడే

టట్లు అన్నారంటే, యికచూడు - కుర్చీ పట్టకుండా వుబ్బిపోతాను. ఇదొక్క మనోవికారం. భక్తుడు యీ వికారానికి అర్హం కారాదు.

అమర్షమనగా — ఈర్ష్య — అసూయ — మత్సరం. ఒకని గొప్ప తనాన్ని చూచి కళ్లల్లో నిప్పులు పోసుకొనే తుచ్ఛగుణమే అసూయ.

ఒక గ్రామంలో యిరుగుపొరుగున యిద్దరు వ్యక్తులుండేవారు. ఇద్దరికీ బద్ధవైరం. ఒకని నీడ నొకడు త్రొక్కడు. ఒకనిపోటొకడు మెచ్చడు. ఒకన్నిమించి ఒకడు గొప్పతనాన్ని సంపాదించాలని తపస్సు కోసం యిద్దరూ అడివికి పోయారు. చెరొక్కచోట కూర్చొని శంకరుని గూర్చి ఉగ్రంగా తపస్సుచేశారు. భోలానాథుడు ప్రసన్నుడై మొదటి వాని దగ్గరికొచ్చి వరాన్ని కోరుమన్నాడు. తాను వరంకోరి తీసుకొంటే రెండోవాడు తనకంటె మరింతా గొప్పవరాన్ని కోరి తీసుకొంటాడేమో ! కాబట్టి తానేమిచేయాలి ? ఆలోచించాడు. "భగవంతా ! నామనవి వినండి. మరొక్కడు ఆచోట తపస్సు చేస్తూన్నాడు. తామక్కడికి పొండి. మళ్లీ నావద్దకు రావలసిన పనిలేదు. అక్కడ వాడు ఏమివరం కోర్తే - దానికి డబుల్‌గా - రెట్టింపుగా నాకు కాంక్ష చేసిపొండి. అంతు - వానికి ముట్టిందానికంటె రెండింతలు నాకు ముట్టాలి".

శంకరుడు రెండోవాని వద్దకుపోయి వరం కోరమన్నాడు. వాడు పరమేశ్వరునితో, మొదటివానిదగ్గర జరిగిన సమాచారాన్ని పూసగ్రుచ్చి నట్లు అంతా తెలుసుకొన్నాడు. తర్వాత అంటాడు. "పరమేశ్వరా ! నాకు ఒకకన్ను చెడిపోయేటట్లు వరం దయచేయండి" — ఇది వాడు కోరుకొన్న వరం. తనకు ఒకకన్నుపోతే తన పగవానికి రెండు కళ్ళూపోతాయి. తనకు కావలసిందంతే. తాను సగంచెడినా ఫరవాలేదు. ఎదిటివాడు పూర్తిచెడితే అంతేచాలు. చూచారా! మాత్సర్యప్రభావం, అంతగాచేసిన వుగ్రతపస్సు కూడా ఆ తుచ్ఛగుణంతో వ్యర్థమైపోయింది.

భయాన్నిగూర్చి లోగడ విమర్శించేవున్నాం. అజ్ఞానమున్నచోట భయముంటుంది. దేహమే తాననుకొనే అజ్ఞానం, జగత్తు నిజమనుకొనే అజ్ఞానం, దేవుడెక్కడో వున్నాడనే అజ్ఞానం — ఈ అజ్ఞానాలే భయానికి కారణం. మనకుండేదంతా యీ అజ్ఞానమే; ఈ భ్రమాజ్ఞానమే. కాబట్టి

భయం మనసెత్తినెక్కి కూర్చొంది. ప్రమాజ్ఞానంతో భయాలు కారణ సహితంగా నివర్తిస్తాయి.

ఒకపిట్ట రెపరెపలాడే పల్చనిరెమ్మపై కూర్చొంది. ఆ సన్ననిరెమ్మ పిట్టబరువుకు జివ్వున వూగుతుంది. వూగిసలాడే కొమ్మపై కూర్చొని కూడా ఆ పిట్ట నిర్భయంగావుంది. కివ్వున కేరింతలుకొట్టుంది. కారణమేమి? ఆ రెమ్మను నమ్ముకొని తానులేదు. దానిపై ఆధారపడీలేదు. తనరెక్క బలంపై తనకు నమ్మకం. తనరెక్కల ఆధారంతో తానుంది. ఆత్మావలంబంతో వుందికాని పరావలంబంతో లేదు. కొమ్మ ఎంతెంతగా వూగినా దానికి భయంలేదు. కొమ్మ కూలిపోనీగాక! రివ్వున తాను ఆకాశానికి ఎగుర్తుంది. అపాయానికి లోనుగాదు.

మనమూ యీ సంసారమనే కొమ్మపై — రెమ్మపై కూర్చొన్నాం. అసలే యిది 'అశ్వత్థ' శాఖ. ఎప్పుడూ వూగేదే. దీనికి స్థిరత్వమెక్కడిది? అనిత్యప్రపంచం వూపినట్లు మనం వూగుతూన్నాం. మనకాస్వావలంబంలేదు. ఆత్మవిశ్వాసంలేదు. ఆత్మ నిర్భరంలేదు. ఒకటేభయం. ఊర్ధ్వదృష్టిలేదు. అధోదృష్టే. రెక్కలబలం లేదు. అసలు — రెక్కలుంటేనా? జ్ఞానమే లేనప్పుడు జ్ఞానబలమెక్కడిది? భక్తే లేనవుడు భక్తిబల మెక్కడిది?

భక్తుడు అనిత్యప్రపంచంపై ఆధారపడిలేడు. నిత్య సత్య పరమాత్మపై ఆధారపడి వున్నాడు. మార్కండేయునిలాగా, శవపిండాన్ని కౌగలించుకోడంమాని శివపిండాన్ని కౌగలించుకొన్నాడు. వానికి భయమెక్కడిది?

ఉద్వేగ మనగా కలవరపాటు. భయమే లేనివానికి కలవరపాటెక్కడిది?

హర్షామర్ష భయోద్వేగైః
ముక్తో యస్స చ మే ప్రియః॥

భక్తుని లక్షణాలు వివరిస్తూ మరీ చెప్పబోతూన్నాడు. "అర్జునా! అనపేక్షుడు — శుచి — దక్షుడు — ఉదాసీనుడు — గతవ్యథుడు — సర్వారంభ పరిత్యాగి, ఈలాంటివాడెవడో వాడే నాకు ప్రియమైన భక్తుడు",

# భక్తియోగ సంచిక.

భక్తుడు అనపేక్షుడు; అనగా అపేక్ష లేనివాడు. అపేక్ష అజ్ఞాన వృత్తి; ఉపేక్ష జ్ఞానవృత్తి. అప + ఈక్ష = బంధానికి కారణం. ఉప + ఈక్ష = మోక్షానికి కారణం. అపేక్ష జీవలక్షణం. ఉపేక్ష ఈశ్వరలక్షణం. అపేక్షతో మునుగుతాడు; ఉపేక్షతో తేల్తాడు. భక్తుడు భక్తినితప్ప దేన్నీ అపేక్షించడు. "ఒల్లడు నిర్జరేంద్రపద మొల్లడు బ్రహ్మపదంబు." భగవద్భక్తుడు భగవంతునితప్ప వేరే పదార్థాన్ని కోరడు. కోరాడా — ఆ పదార్థానికే భక్తుడుకాని భగవంతునికి భక్తుడు కాబోడు. పరపురుషుని కోరేది పతివ్రత కాలేదు; ప్రాపంచిక వస్తువులను కోరేవాడు భక్తుడు కాలేడు.

నరేంద్రుడు (వివేకానందుని పూర్వనామం) దరిద్రంతో అట మటించిపోయేవాడు. పూటపూట తిండికి గండంగావుండేది. అతని అగచాట్లుచూచి గురువైన రామకృష్ణుడు శిష్యుని చేరబిలిచి "నరేంద్రా! దట్టదరిద్రంతో సతమతమైపోతూన్నావే! కాళీమాతను ప్రార్థించి ఐశ్వర్యాన్ని కోరుకోరాదా?" — అని చెప్పాడు.

"స్వామీ! నాకు ఆ అభిప్రాయం యీవరకే కల్గింది. కాని అదేమిమాయో? అమ్మవారి ఎదుటికి పోగానే, నా దరిద్రాన్ని — నా కుటుంబాన్ని — అసలే ప్రపంచాన్నే మరచిపోతాను. అమ్మా! అస్ఖలితమైన భక్తిని దయచేయుమంటూ అప్రయత్నంగా కోరుకొంటాను" — అని నరేంద్రుడు గురుదేవునికి ప్రత్యుత్తరం చెప్పాడు.

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు తనకు తల్లై తండ్రై ప్రభువై ప్రాణనాథుడై వుండగా, అవి కావాలి — యివి కావాలనే చిలిపికోర్కెలు భక్తునికెందుకని? కాబట్టే భక్తుడు అనపేక్షుడు.

భక్తుడు శుచియై వుంటాడు. అణురేణు తృణకాష్ఠ పశుపక్షి క్రిమికీటక సర్వ చరాచర వస్తువుల నన్నింటిని భగవత్స్వరూపంగా చూచేవానికి శుచిగాక అశుచి ఏవిధంగా వస్తుంది? లోపలా బైటా వాడు శుచిర్భూతుడు. కొందరికి బాహ్యశుచియందే యెక్కువ లక్ష్యముంటుంది. వారు అంతశ్శుచిమాట తలపెట్టరు. కొంతమంది అంతశ్శుచివుంటే చాలు; బాహ్యశుచితో పనిలేదని తాత్సారం చేస్తారు. ఈ ఉభయపక్షాలు లోపభూయిష్ఠాలే. బాహ్యశరీరము శుచి శుభ్రతలతో

వుండాలి. అంతఃకరణం కామక్రోధాది రహితంగా వుండాలి. అప్పుడే వాడు భక్తుడు కాగలిగేది.

తర్వాతివిషయం "దక్షః". భక్తుడు దక్షుడై వుంటాడు. సోమరిపోతులు భక్తులు కాలేరు. ప్రపంచంలో ఏపనికి పనికిరానివారు భక్తులై తారని ప్రతీతివుంది. వేషధారిభక్తులు ప్రబలుటే యీ ప్రతీతికి హేతువు. తనపొట్టనే తాను నింపుకోలేక భక్తి అనేసాకుతో పరులపై భారాన్ని పెట్టే దద్దమ్మలను భక్తులనుట మహాపచారం. సవ్యసాచి అర్జునునివలె — మహావీరుడు ఆంజనేయునివలె — సమర్థరామదాసువలె — ఛత్రపతి శివాజివలె — స్వామివిద్యారణ్యునివలె — శ్రీబసవేశ్వరునివలె — మహాత్మాగాంధీవలె- ఆచార్య వినోబావలె, భక్తుడు సర్వసమర్థుడు.

నవబ్రహ్మలలో దక్షుడని ఒకనిపేరు. ఆతని సంతానమంతా ఆడుబిడ్డలే. ఒకకూతురు సతీదేవిని శివునికిచ్చి వివాహంచేశాడు. సతీదేవి అనగా బ్రహ్మవిద్య. తక్కినబిడ్డలు ఆయా లౌకిక విద్యలు. దక్షుడు అన్ని విద్యలకు తండ్రి అని అర్థం. ఆలాగా భక్తుడున్నైతం అన్నిట సమర్థుడు; చతురుడు.

భక్తుడు ఉదాసీనుడు. ఉదాసీనుడంటే వొళ్లుబరువై పడివుండే అసామి అని భావించరాదు. 'వట్టి నాపలిగా తలంచరాదు. ప్రపంచంలో వుండీ వాడు వుండనివాడు. అంటీ అంటనివాడు. సమస్తాన్ని చూచేసాక్షి. ధూళి గాలి నంటనట్లు, బురద కుమ్మరపుర్వునంటనట్లు, జిడ్డునాలుకనంటనట్లు, నీరు తామరపాకునంటనట్లు, కాటుక కంటినంటనట్లు ప్రాపంచిక విషయవాసనలు వాన్ని అంటుకోలేవు. అద్దం మంచిచెడ్డలన్నింటిని చూస్తుంది; చూపుతుంది. ప్రతివస్తువును అమాంతం కౌగలించుకొంటుంది. కానీ దేనితోనూ అంటుకోదు. దానికి మంచిపై రాగంలేదు; చెడ్డపై ద్వేషంలేదు. దేన్నీ పట్టీపట్టనట్లు. అదే ఉదాసీనం. భక్తుడు అద్దంవలె ఉదాసీనుడై వుంటాడు.

భక్తుడు గతవ్యథుడు. వ్యథలు — వ్యాకులాలు, తాపాలు — కోపాలు, తొందలు — తొందరలు, వాన్ని వదలిపెట్టిపోయాయి. చావంటే భయంలేదు; బ్రతుకంటే ఆశలేదు. వానికి అబ్బురంగొలిపే హఠాత్సంఘటనమంటూ సృష్టిలో ఏదీలేదు.అన్నీ పూర్వనిర్ణీతాలయ్యే అవశ్యం

భావిగ జరుగుతవని వానికి తెలుసు. ఇక చింత దేనికి? మానసిక క్షేత్రాన్ని అతిక్రమించిపోయినవానిని వ్యథలు — విచారాలు ఆక్రమింపలేవు.

భక్తుడు సర్వారంభ పరిత్యాగి — సర్వసంకల్పాలను వదలిపెట్టిన వాడు. ఈ లక్షణం నిష్క్రియాత్మ స్వరూపనిష్ఠయందే సిద్ధిస్తుంది; కాని అన్యత్ర సిద్ధింపదు. కాబట్టి శంకరులవారు తప్ప తదితరులెవ్వరూ యీ చోట చక్కని అర్థం చెప్పలేకపోయారు. నిజంచెబితే తమ సగుణనిష్ఠకు భంగం వాటిల్లుతుంది.

తనస్వరూపం ఏమీచేసేదికాదు. చూచేదిమాత్రం. మనస్సుచేసేది; ఆత్మచూచేది. అది కూటస్థం. గుణకార్యాలైన యింద్రియాలు, గుణ కార్యాలైన విషయాలల్లో ప్రవర్తిస్తాయి. తాను కేవల సాక్షిమాత్రం. ఈ కేవలాత్మజ్ఞానం కల్గితే 'సర్వారంభపరిత్యాగం' సమకూర్తుంది.

'భగవంతుడే సమస్తానికి కర్త. తాను నిమిత్తమాత్రం.' — యీ విధంగా భావించుటకూడా ఒకవిధంగా సర్వారంభ పరిత్యాగమనే పరిగ ణిస్తారు. ఇక్కడికి పదారవశ్లోకం ముగిసింది. భగవంతుడు మరీభక్తుని లక్షణాలను వర్ణిస్తూన్నాడు.

"అర్జునా! భక్తునికి ఖేదమోదాలులేవు. రాగద్వేషాలు లేవు. మంచి చెడ్డలులేవు. అట్టివాడె నాకు ప్రియుడు."

అఖండవ్యాపక పరమాత్మ ఒకటే వుండంగా దేన్ని మంచి — దేన్ని చెడ్డ అనాలి? భగవంతుడుగాక వేరేవస్తువు ఒకటి వుందనుకోడం దేహాభిమాని లక్షణం. అది భక్తునికి తగదు. మంచిచెడ్డలనే వివక్షే చెడ్డ. ఆ వివక్ష లేకుండుటే మంచి. ప్రపంచవిచారమే చెడ్డ. పరమాత్మ విచారమే మంచి. గుణదోషదృష్టే దోషం. అది లేకుండుటే గుణం.

భక్తునివర్ణనతో తనివిబొందక భగవంతుడు మరీచెబుతూన్నాడు. భగవంతునికే తనివి లేనపుడు మనకెందుకు కల్గాలి?

"ఓ అర్జునా! శత్రుమిత్రులు — మానావమానాలు — శీతోష్ణాలు — సుఖదుఃఖాలు — నిందాస్తుతులు, భక్తునికి సమానాలు. భక్తుడు అసంగుడు; మౌని; యదృచ్ఛాలాభసంతుష్టుడు; అనికేతుడు; స్థిత ప్రజ్ఞుడు. అట్టివాడే నాకు ప్రియమైనవాడు". 18—19

భగవంతుడు ప్రేమసముద్రుడు. ప్రేమస్వరూపుడు. ఏ ఏ వేళల్లో కూడా వాని ప్రేమకు అపవాదం వుండరాదు. తన ప్రాణప్రియుడు పరమేశ్వరుడు విశ్వమంతా నిండివుండగా వానికి శత్రులెవరు? మిత్రులెవరు? సమమైన ఆత్మదృష్టేకాని విషమమూ కల్పితమూనైన వుపాధిదృష్టి వానికిలేదు. వాని దృష్టిలో గౌరవాగౌరవాలకు విలువేలేదు. అనిత్య ప్రపంచమిచ్చే గౌరవాగౌరవాలతో వానికి పనేమి? అసలు — ఈ ప్రపంచానికి గౌరవమంటూ వుంటేనా?

ఒక గ్రామంలో యిద్దరు వ్యక్తులుండేవారు. ఒకనికి ఎప్పుడూ ఎక్కడపోయినా గుర్రాన్ని ఎక్కిపోయేది అలవాటు. మరొక్కడు ఎక్కడ కూర్చొన్నా ఒఱుగుదిండులేక కూర్చోలేడు. అది వానికి అలవాటు. కాబట్టి వాడు ఏ వూరికి పోతూన్నా ఒఱుగుబిళ్ల (ఆనుడు దిండు) నెత్తినపెట్టుకొని పోతాడు. ఆ యిద్దరికి తలవనితలంపుగా ఒకేరోజు ప్రయాణం తటస్థించింది. పదిమైళ్ల దూరంలోవుండే ఒక గ్రామానికి పోవలసివచ్చింది. గుర్రమెక్కిపోయేవాడు ముందుముందు పోతూన్నాడు. ఒఱుగుదు దిండు నెత్తిన పెట్టుకొన్నవాడు వెనుకవెనుక పోతూన్నాడు. ఒకరి సంబంధం వొకరికి లేనివ్యక్తులైనాకూడా అదాటుగా ప్రయాణం అలా కుదిరింది. మధ్యలో ఒక గ్రామంగుండా పోవలసి వచ్చింది. ఆవూరివారు వీరిని చూచారు. ముందుగా గుర్రమెక్కిపోయేవాడు తాసీల్దారు కావొచ్చు. వెనుక పోయేవాడు బంట్రోతుకావొచ్చు, అని అనుకొన్నారు. నెత్తిన పెట్టుకొన్న దిండును ఏదో మూట అని భావించారు.

ప్రయాణికులిద్దరు చేరవలసినగ్రామం చేరారు. వూరికి నడిబొడ్డులో వుండే ధర్మశాలవద్దకు పోయారు. చేరడమే ఆలస్యం — దిండువాడు దిండును గోడకు ఆనించి ఠీవిగా కుర్చొన్నాడు. గుర్రమువాడు (రౌతు) గుర్రాన్ని దిగి తగినచోట దానిని కట్టివేసేకోసం అట్టిటు తట్టాడుతున్నాడు. ఆ వూరివారు అనుకొన్నారు. "దిండుకు ఆనుకొని కూర్చొన్నవాడు తాసీల్దారు కావొచ్చు.గుర్రాన్నిపట్టుకొన్నవాడు బంట్రోతు కావొచ్చు."

లోకం గ్రుడ్డిది. వివేకంలేని లోకమిచ్చే మానమర్యాదలతో తనకు వొరిగేదేమి? తరిగేదేమి?

. భక్తుడు శీతోష్ణ సుఖదుఃఖాలల్లో సముడుగా వుంటాడు. ఘట ప్రారబ్ధంకొద్ది వచ్చే కష్టసుఖాలలో తాదాత్మ్యం చెందక సమాధానంతో వాటిని గడిపివేస్తాడు. వాని చిత్తానికి వికారముకాని క్షోభగాని వుండదు.

భక్తుడు సంగవర్జితుడు. ఏచోటకూడా స్నేహబంధం వానికిలేదు. అతడు నిందాస్తుతులతో సమానుడు. దూషణ భూషణ తిరస్కారాలు దేహానికేగాని ఆత్మకు లేవు. అట్టిచో నిందాస్తుతులకు చలింపవలసిన పనేమి? నింద అన్నా—స్తుతి అన్నా, ఏబై రెండు అక్షరాలల్లోని వ్యత్యాస క్రమమేగదా !

"అయ్యా ! నిన్ను ఆయన నిందించా"డని ఒకవ్యక్తి ఒకానొక జ్ఞానితో చెప్పాడు. ఆయన చెప్పిన సమాధానమేమంటే — "నన్ను నిందించాడన్నావే? ఆత్మను నిందించాడా? దేహాన్ని నిందించాడా ? ఆత్మను నిందించాడంటే — అందరిలో వుండే ఆత్మ వొకటే కాబట్టి వాడు తన్ను తాను నిందించుకొన్నట్లయింది. దేహాన్ని నిందించాడంటే నాకు మరింతా వుపకారమేచేశాడు. ఈ శరీరం స్వభావదుర్గంధమని — అశౌచమని — అధ్రువమని — మూత్రపురీష భాజనమని నేనే యీ మల పిండాన్ని నిందిస్తూండేవాణ్ణి. నాశ్రమనువాడూ కొంత పంచుకొన్నాడు."

చూచారా ! ఎంతటి సమాధానమైనమాట. మరోవిషయం చెబుతాను వినండి. నీకొకడు వుత్తరం (జాబు) వ్రాశాడు. పోస్టుమేన్ తెచ్చి నీకు యివ్వబోతాడు. తీసుకొంటే నీదే. కాని తీసుకోక నాది కాదు, నాకొద్దంటే ఆ జాబు ఏమైతుంది — తెలుసా? పోస్టల్ నియ మాన్ని బట్టి వ్రాసినవాని చిరునామా (From address)కు త్రిప్పి పంపివేయ బడ్తుంది. అట్లే ఎవరైనా నిన్ను నిందిస్తే — నన్ను ఫలానా నిందించాడనే వికారాన్ని — అభిమానాన్ని పొందావంటే అది ర్తుంది; చెందుతుంది. కాని నిర్వికార చిత్తంతో దాన్ని తిరస్క రిస్తే భగవంతుని ప్రకృతి చట్టాన్నిబట్టి అది ఫ్రమ్ అడ్రెసుకు - నిందిం చినవాన్నే చేరి చుట్టుకొంటుంది.

మరీ భగవంతుడు చెబుతూన్నాడు. భక్తుడు మౌని. మౌని అంటే మననశీలుడని అర్థం. మాటలాడనివాడు మౌని అని కొంద రంటారు. అదంత తృప్తికరమైన మాటకాదు. మాటలు మానడం —

నిజమైన మానానికి ఒక బాహ్యసాధనం మాత్రం. పరా పశ్యంతి మధ్యమ వైఖరులని వాక్కు నాల్గువిధాలు. మనం మాట్లాడే మాటలు వైఖరీ వాక్కులు. ఈ వైఖరీ వాక్కును మధ్యమవాక్కునందును, మధ్యమను పశ్యంతి వాక్కులోను, పశ్యంతిని పరావాక్కులోను లయంచేసి ఆ ప్రణవానికి లక్ష్యార్థమైన పరబ్రహ్మమే తానై వుండుట, నిజమైన మానం, అది సిద్ధావస్థయొక్క లక్షణం.

భక్తుడు 'సంతుష్టో యేనకేనచిత్'—యదృచ్ఛా లాభసంతుష్టుడు. వాని తృప్తి బైటివస్తువులపై ఆధార పడిలేదు. ఆత్మతృప్తుడై వున్నాడు. ఆశను జయించాడు. నదులు రానీ—రాకపోనీ సముద్రానికి కొఱతలేదు. విషయాలు లభించనీ – లభించకపోనీ వాని తృప్తికి వెలితిలేదు.

భక్తుడు అనికేతుడు. నికేతమనగా యిల్లు. ఇల్లు లేనివాడని – నిశ్చితస్థాననివాసం లేనివాడని అర్థం. ఈ అర్థం సంన్యాసపరమైపోతుందని తిలకుగారు ఎంతో కంగారుపడ్డారు. ఏమిపడ్డా నిజానికి మసిపూసే వీలులేదు. భక్తుడు ఏస్థానంపైకూడా అభిమానముంచడు. ఇదొక్క అర్థం. తాను అఖండవ్యాపకమగు ఆత్మకాబట్టి తనకొక చోటెక్కడిది? ఇదొక్క అర్థం.

భక్తుడు స్థిరమతి; స్థితప్రజ్ఞుడన్నమాట. భక్తుడు కాకపోతే స్థితప్రజ్ఞుడు కాలేడు. స్థితప్రజ్ఞుడు కాకుంటే భక్తుడు కాబోడు.

అని యీ విధంగా భక్తలక్షణాలను ఏడు శ్లోకాలద్వారా చెప్పి భగవంతుడు కృష్ణుడు యీ చివరిశ్లోకంలో అధ్యాయంయొక్క ఫలశ్రుతిని వర్ణిస్తున్నాడు.

"అర్జునా! భగవంతుడే పరమగతి అనే శ్రద్ధతో యెవరు అమృతస్వరూపమైన యీ ధర్మాన్ని చెప్పినవిధంగా సేవిస్తారో – వారు నాకత్యంత ప్రీతిపాత్రులైన భక్తులు."

ఈ అధ్యాయంలో చెప్పబడిన విషయం అమృతధర్మమని భగవంతుని వుపదేశం. శ్రద్ధాహీనులకు దీని ప్రభావం గోచరింపకపోవచ్చు. శ్రద్ధతో యీ ధర్మాన్ని ఆచరించినవారు భగవంతునికి మిక్కిలి ప్రేమాస్పదులగు భక్తులు. వారికి భగవంతుడే పరమప్రేమాస్పదుడు.

## గ్రంథశేషం.

గీతాచార్యుని కృపతో, యీ పవిత్రస్థానంలో పరమపవిత్రమైన భక్తియోగాన్ని విచారించుకొనే సదవకాశం మాకు లభించింది. మేమెంతో కృతార్థులం. మా యీ ప్రసంగంలో యేమాత్రం ఉపాదేయ విషయం — ఉత్తమ వస్తువు దొరికిందంటే అది భగవంతుని కరుణతో లభించిందని తలంచండి. త్రుటులు లోపాలు, స్ఖాలిత్యాలు — ప్రమాదాలు కలిగాయంటే వాటిని కేవలం నా బుద్ధి పైన్నే వదలండి. ప్రసంగవశాత్తు ప్రవాహపతితంగా మీ మనస్సులకు నొప్పికల్గించే మాటలు — అశాస్త్రీయ ప్రసంగాలు మానుండి వెలువడివుంటే మరిచిపోండి. అవి నా అంతఃకరణదోషాలు. వాటిని భగవంతునిపై రుద్దరాదు. క్రమంగా మీాదట ఆలాంటి దోషాలను సవరించుకొంటాం. ఇట్టి పవిత్రసేవను మాకు భగవంతుడు పదేపదే ప్రసాదించుగాక అంటూ కోరుకొంటూ విరమిస్తూన్నాను.

ఓం బ్రహ్మార్పణం బ్రహ్మహవిః—బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం।
బ్రహ్మైవ తేన గంతవ్యం — బ్రహ్మ కర్మ సమాధినా॥
మంగళం శ్రీకురుక్షేత్ర — రణక్షోణి విహారిణే ।
పార్థసారథిరూపాయ — గీతాచార్యాయ మంగళమ్॥

—: గ్రంథ సమాప్తి :—



శ్రీ

# ద్వాదశోఽధ్యాయః.

## భక్తియోగః.

★

అర్జున ఉవాచ:—

ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే ।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥ ౧

శ్రీభగవానువాచ:—

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః ॥ ౨

యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే ।
సర్వత్రగమచిన్త్యం చ కూటస్థమచలం ధ్రువమ్ ॥ ౩

సంనియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః॥ ౪

క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్ ।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥ ౫

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥ ౬

తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి న చిరాత్పార్థ! మయ్యావేశితచేతసామ్ ॥ ౭

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ ౮

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ! ॥ ౯

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ ।
మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి ॥ ౧౦

అథై తదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ ౧౧

శ్రేయో హి జ్ఞానమభ్యాసా జ్జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్కర్మఫలత్యాగ స్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్ ॥ ౧౨

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహంకారస్సమదుఃఖసుఖః క్షమీ ॥ ౧౩

సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః ॥ ౧౪

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః ॥ ౧౫

అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః ॥ ౧౬

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః ॥ ౧౭

సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః ॥ ౧౮

తుల్యనిన్దాస్తుతిర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్ ।
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నరః ॥ ౧౯

యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥ ౨౦

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే భక్తియోగోనామ ద్వాదశోఽధ్యాయః.

ఓం తత్ సత్.

# భక్తుని లక్షణములు.

రాగం – ఖమాజ్ – ధమాళీ.

[ ఈ పాట గుజరాతీ దేశమున సుప్రసిద్ధభక్తుడై వెలసిన నరసింహామెహతా వ్రాసినది. శ్రీ మహాత్మా గాంధీగారు దీన్ని నిత్యప్రార్థనలో ఉపయోగిస్తూ వచ్చారు. నిజమైన వైష్ణవు (భక్తు)ని లక్షణాలు ఎట్టివో, యిందులో వివరింపబడ్డవి. ]

వైష్ణవజనతో తేనే కహియే – జేపీడ పరాయీ జాణేరే।
పరదుఃఖే ఉపకార కరేతోయే, మన అభిమాన న ఆణేరే॥
సకలలోకమాఁ సహునే వందే, నిందా న కరే కేనీరే।
వాచ కాఛ మన నిశ్చలరాఖే ధన ధన జననీ తేనీరే॥
సమదృష్టినే తృష్ణాత్యాగీ పరస్త్రీ జేనే మాతరే।
జిహ్వాథకీ అసత్య న బోలే పరధన నవ ఝాలే హాథరే॥
మోహమాయా వ్యాపే న హి జేనే, దృఢవైరాగ్య జేనా మనమాఁరే।
రామనామ సూఁ తాలీలాగీ, సకలతీరథ తేనా తనమాఁరే॥
వణలోభీనే కపటరహితఛే, కామక్రోధ నివార్యారే।
భణే నరసైఁయో తేనుదరశనకర్తాఁ, కులఏకోతేర తార్యారే॥

# వారలు.

ఆళ్లగడ్డ శ్రీ శంకరానందాశ్రమ నిర్మాణ దాతయగు శ్రీసదానందస్వామివారి పుణ్యారాధనమును పురస్కరించి శ్రీ శ్రీ శ్రీ శంకరానందస్వాములవారు 11-11-54 నుండి 22-11-54 వరకు ఉపన్యాసములు కావించినారు. అచ్చటినుండి శ్రీవారు హొస్పేట చేరినారు.

హొస్పేట (బళ్లారిజిల్లా) శ్రీగీతాసేవాశ్రమమునందు 24-11-54 నుండి వారం రోజులు శ్రీ శంకరానందస్వామివారి ఉపన్యాస కార్యక్రమము జరిగినవి.

6-12-54 నుండి 12-12-54 వరకు మైనూరు స్టేటు అజ్జంపూరు శ్రీశివానందాశ్రమమునందు వింశతివార్షిక గీతాజయంతీ సప్తాహ మహోత్సవము జరిగినది. శ్రీవారి ఉపన్యాసములు యిరుపూటలును జరిగినది.

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra)

# భక్తుని ప్రకారభేదాలు.

శ్లో॥ సర్వభూతేషు యః పశ్యేద్ - భగవద్భావమాత్మనః ।
భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమః ॥

తా॥ బ్రహ్మాభిన్నమగు తన స్వరూపము సమస్త భూతములందును అధిష్ఠానరూపమున వ్యాపించియున్నదనియు, ఆ తన స్వరూపమునందు సర్వ భూతములును అధ్యస్తరూపమున వున్నవనియు తెలుసుకొనువాడు ఉత్తమ భాగవతుడు.

శ్లో॥ ఈశ్వరే తదధీనేషు - బాలిశేషు ద్విషత్సు చ।
ప్రేమమైత్రీకృపోపేక్షా - యః కరోతి స మధ్యమః ॥

తా॥ భగవంతునియందు ప్రేమయు, భక్తులయందు మైత్రియు, పామరులయందు కనికరమును, శత్రువులయందుపేక్షయు వహించువాడు మధ్యమభాగవతుడు (భక్తుడు).

శ్లో॥ అర్చాయామేవ హరయే - పూజాం యః శ్రద్ధయేహతే।
న తద్భక్తేషు చాన్యేషు - స భక్తః ప్రాకృతః స్మృతః॥

తా॥ ఎవడు శ్రద్ధతో ప్రతిమయందే భగవద్భావముంచి పూజించుచు భక్తులయందుగాని యితరులయందుగాని మరెక్కడగాని సత్కారము చూపడో వాడు కనిష్ఠ (అధమ) భక్తుడు.

(భాగవత ఏకాదశస్కంధము).

15th DECEMBER 1954.

# భక్తియోగమహిమ.

1. భక్తియోగం భగవద్గీతలోని అన్ని అధ్యాయాలల్లో చిన్నది. ఇందులో వుండేది యిరవై అనుష్టుప్ శ్లోకాలు మాత్రం. పదిహేనవ అధ్యాయం పురుషోత్తమప్రాప్తి యోగంలో కూడ యిరవై శ్లోకాలే వున్నాయి; కాని వాటిలో అయిదు శ్లోకాలు పెద్దవి. కాబట్టి దానికంటె యీ భక్తియోగాధ్యాయం చిన్నది.

2. ఈ భక్తియోగం భక్తిషట్కంలో చివరిది. ఆ షట్కానికి శిఖరంలాంటిది. వీలులేని పరిస్థితిలో శిఖరాన్ని దర్శిస్తే దేవున్ని దర్శించిన ఫలితం సిద్ధిస్తుందని చెబుతారు. అనివార్య పరిస్థితులలో యీ భక్తియోగాన్ని పఠించి పూర్ణ ప్రయోజనాన్ని పొందొచ్చు.

3. భక్తుడు భగవంతున్ని పొగిడిన శాస్త్రాలు లోకంలో ఎన్నోవున్నాయి. భాగవతం – నారద భక్తిసూత్రాలు–శాండిల్య భక్తిసూత్రాలు, వీటిల్లో భక్తుడు భగవంతుని పొగిడాడు. కాని యీ అధ్యాయంలో భగవంతుడే తన నోటారా భక్తుని పొగిడాడు.

4. ఈ అధ్యాయం ‘ధర్మ్యామృతం’. ధర్మసారమైన అమృతం. మందరపర్వతాన్ని తేవలసిన–వాసుకిని చుట్టవలసిన–పాలసాంద్రాన్ని మథించవలసిన–హాలాహల సంకటానికి శంకించవలసిన, పనిలేక లభించిన అమృతం.

శ్రీరామకృష్ణ